# పీఠిక.

ప్రేమతత్త్వమనునిది కేవల పద్యాత్మకమైన యొక స్వతంత్రకావ్యము. 1920 సంవత్సరమున నా జీవితమున సంఘటిల్లిన యాకస్మిక విపరిణామమునఁ దన్మయమై తదేకాగ్రమైన నా చిత్తవృత్తియే యీ గ్రంథముగాఁ బరిణమించినదనుటకంటె దీని స్వతంత్రతను వేఱుగా వివరింపఁ జాలను.

భారతి ప్రథమ సంవత్సర సంచికలలో వరుసగాఁ బ్రకటింపఁబడిన యీ కావ్య మాంధ్రలోకమున కపరిచితముకాదు గావున నిందలి విషయ మిట్టిదని యెఱుక పఱుచుట యావశ్యకముకాదు. అయినను, ఒక్కమాట :—

ఇందు పూర్వము ఉత్తరము నని రెండుభాగములు గలవు. పూర్వభాగమునఁ గేవల మైహికమైన రాజసతామస ప్రేమయు, ఉత్తరభాగమున నైహికాముష్మికరూపమైన సాత్త్వికాదిప్రేమయు, లోకానుభవసిద్ధముగా వర్ణింపఁ బడినవి. మఱియు నొక జీవి భూమిపైఁబడినది మొదలుగా శరీరము విడిచిపోవునంతవఱకు శైశవాది వివిధావస్థల నేది కాంక్షించినను, ఏది ద్వేషించినను, ఏది పరిగ్రహించినను, ఏది పరిత్యజించినను, అందలి వివిధములైన చిత్తవృత్తులన్నియుఁ బ్రేమమూల

కములే యనియు, ఆప్రేమ యాత్మార్థమే కాక యన్యార్థ
ము గా దనియును నిరూపింపఁబడినది. ఇందొక్కొక్క విషయ
నందు నుదాహరించిన గాథలన్నియు యథార్థములే కాని కల్పి
తములు గా వనుట యిందలి విశేషము. పలు తెఱఁగులయి
కోరికలకుఁ బ్రేరకమైన ప్రేమను శాఖోపశాఖలుగా విభజిం
వర్ణించుటచే దాని కాలవాలమైన మానసమును బవిత్రితఁ
గావించుటయే దీని ప్రధానోద్దేశము. అందుచే నిది మాన
తత్త్వ మనెడి నామాంతరమున కర్హమగుచున్నది.

ఇట్లు స్వాతంత్ర్య మార్గము ద్రొక్కిన యీ కృతియౌ
చిత్యానౌచిత్యములను నిర్ణయింపఁ బ్రాజ్ఞాలోకమే ప్రమా
ణము. సహృదయులు గుణజిజ్ఞాసతో దీనిని జిత్తగించుటయే
నాశ్రమమునకుఁ దగిన ఫలము.

రాజమహేంద్రవరము
28—2—1931

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

ఓం నమః పరబ్రహ్మణే.

# ప్రేమతత్త్వము.



## పూర్వభాగము.

---

### — ప్రేమప్రశంస —

ఆనందమయము సత్య
జ్ఞానానంతాత్మ మఖిలజగదుదయలయ
స్థానం బగుపరతత్త్వము
ధ్యానించి మదాత్మ, బ్రేమతత్త్వ మొనర్తున్. 1

సకలజగంబు దేనికి వశంవదమై యలరారు, దేనిఁ
నకుటిలచిత్తవృత్తులనిజాకృతు లారయవచ్చు, దేనిచే
నొకని నొకండు కట్టువడు నుల్లమునం దకలంకవృత్తి, న
య్యకలుష మైనప్రేమ మొకటద్భుతశక్తి జగీషు వయ్యెడిన్.

కామితభోగభాజన మకాంక్షితదైవవిపాకహారి యు
ద్దామసవృత్తిరాజనగరస్థితి నాత్మవికర్తన త్రియా
ధామము లోకమానసవదస్థిరనిత్యనివాస మైనయా
ప్రేమ మొకండె చిత్రముగ భిన్నగతిన్ జగమాక్రమించెడిన్. 2

అవనిఁ బిపీలికాదిమనుజాంతము జన్మము లెత్తినట్టి జంతువులశరీరపోషణవినోదవిధానవిరోధసఖ్యబాంధవపరితాపముఖ్యచరితంబు పరామరిసించి చూడ నిక్కువముగ దానికంతకును గూరిమి కారణ మంచుఁదోఁపదే

మనసయకోవిదుల్ తెలివి మాలినవానిఁగఁ జూచి లెక్కయునిపశుపక్షికీటకము లన్నియు నోరును వాయి లేక జీవన మొనరించునట్లు గనవచ్చుచు నున్నను, వానిచేష్టలన్ గనుఁగొనఁ బ్రేమ ముట్టిపడునైపుణి యెంతయుఁదోఁపకుండు

ఎప్పు డెక్కడికేని యెడఁబాయ కెరలకై
చనుచుండు పక్షుల జతలయందు
దొరకినయెర పరస్పరము సంగోరు గాఁ
జవిచూచు పక్షుల జంటలందు
వలపించు ముక్కుకూర్పుల రెక్కదార్పులఁ
గ్రీడించు పక్షులజోడులందు
తమకించు పిలుపుకూఁతల సంజకడ గూళ్ళ
కడఁ గూడుపక్షుల కవలయందు
గూండ్లముంగిండ్లఁ దల్లులకొఱకు సంజ
వేళలం గూయుపక్షులపిల్లలందు
కాంచువారలకన్నులకవు దీఱఁ
ప్రేమదేవత సాక్షాత్కరించుఁ గాదె!

బారులు తీరి యంబరవీథి వేడ్కమై
విహరించుచుండెడి విహగములను,
క్రమలోన నొకటి బంధములోనఁ జిక్కుచో
వడలు చార్చుచు నుండు నండజముల,
గ్రుడ్లు పెట్టుట కనుకూలంబుగా గూళ్ళు
కట్టుచుండెడి పోతుపిట్టజతల,
ఆగ్రుడ్లు పొదిగెడి యాఁడుపిట్టల కెర
గొనివచ్చి యిచ్చు శకుంతములను,

చక్కఁగాఁ జూచిన విహంగజాతులందు
నైకమత్యవిధానంబు నధికమైత్రి
సహజసంసారసుఖలాలసత్వ మెల్ల
కన్నులకుఁ బండు వగునట్లు గానరాదె! 7

తల్లిపిల్లలలో నితమకంబు గోమహి
ష్యాదిజంతువులందు నరయవచ్చు
ప్రాణసంరక్షణప్రకటానురాగంబు
హరిణాదిమృగముల నరయవచ్చు
చిన్నపెద్దలలోని ప్రేమ యారణ్యక
కరిసంఘములయందు గాంచవచ్చు,
ఆత్మజాతిప్రసిద్ధానురాగరసంబు
వానరంబులయందు గానవచ్చు

మఱియు నిది యెల్ల సర్వసామాన్య మగుచు
స్పష్టపడఁ గావె చూడుఁడీ సృష్టిమహిమ!
వానికూర్మియె యట్టు లేపారుచుండ
మానవప్రేమ మింక సామాన్య మగునె?

వీనులుఁ గన్నులుం దనకు వేఁగులవారయి వార్తదెల్ప;నే
నానియుఁ గాముఁ డాపరిజనంబును మున్నరు దేరఁ, బ్రేమభూ
జాని జిగీష వెల్వడి యసాధ్యపదంబులు గెల్చి పూన్కిమై
మానసరాజధానికి సమస్తసుఖార్థము చేర్చు నెల్లెడన్ 9

ఇది యది నాక యేదయిన నెందలిదైనను బొందఁగోరుచో
మొదలఁ దలంచు సామమున ముట్టఁగ, నంతటఁ జూపు దానమున్
బదపడి భేద, మాపయిని బట్టును దండము, రాజనీతికో
విదుఁ డగు ప్రేమభూవరుఁ డభీష్టపదార్థము సేకరింపఁగన్.

కనుకట్టువిద్య నేర్చినయట్టిమాయావి
కామినీకాముకఘటనదూత
సంసారరథచక్రసంచారపుంవీథి
బహువిధార్థార్జనోపాయవక్త
శత్రుత్వమిత్రత్వశౌర్యసాహసపేటి
పాపపుణ్యములనిక్షేపభూమి
బహుళశృంగారరూపకసూత్రధారుఁడు
పరమసంతోషసమ్రాజ్యనాథు

వివిధరసకావ్యనాయకవేషధారి
దుఃఖసుఖముల నెఱుఁగనిదోషకారి
ఛీరసహకారి వృత్తివికారి నాఁగ
మానవప్రేమ దేదీప్యమాన మగును. 11

జగ మంతయుఁ బ్రేమమయం
బగు ననఁగాఁ జెల్లుఁ గాని యది యిది యనఁగాఁ
దగు నొక్కోః పరిశీలిం
పఁగఁ గూరిమి లేనియొక్కపనియుం గలదే? 12

## — అవతారిక —

ఇది యొకచిత్తవృత్తి యని యెంచిరి పెద్దలు, కాని దీనినే
మొద జనియించునట్టిబహువృత్తులమూలముగా వచింప నై
రదియును గాక దీనివివిధాకృతిచేష్టలు నిర్వచింప నై
రది గద దీనిరూపు తెలియందగుచర్చకు మూల మయ్యెడిన్!

ప్రేమ యొక్కటియే వేఱువేఱు కార
ణముల వెవ్వేఱునామరూపములఁ జెందు,
మట్టి యొక్కటె ఘూళిజంబాలలోష్ట
కుంభకుడ్యాదిసంజ్ఞలఁ గూడినట్లు. 14

గురుజనమందు భక్తియును గోమలియం దనురక్తిబంధుసో
దరులయెడం బ్రియత్వమును దాసనుతాదుల వత్సలత్వమున్

బరహితమిత్రులందును సమానమనస్కులయందు హార్దమై
పరగుచుఁ బ్రేమ మొక్కటె వివర్తములొందు విభిన్నరూపమై.

అట్లు వేఱయ్యు నొక్కటే యనఁగఁ దగియు
వేఱుపఱుపట్టి యొక్కొక్క విధమునందు
మరల బహువిధతారతమ్యంబు లొంది
ప్రేమ శాఖోపశాఖలై వెలయుచుండు. 16

కామినిఁ గౌఁగిలించుటను గాదిలికూఁతురిఁ గౌఁగిలించుటన్ బ్రేమము వేఱువృత్తులఁ జరించినపద్ధతి, నట్లె యన్యకాంతాముఖసోదరీవదనతామరసంబులు చూచునాఁటియా ప్రేమవిచిత్రవృత్తిపదవిం దలపోసిన, దానివృత్తి మాయామహిమంబు దానికిర వైనమనంబు నెఱుంగఁజాలునే యేమనవచ్చుఁ? గోరినదియే తన కబ్బినయప్పు డట్టిదే కామితవస్తు వొందు పరకాంక్షితమై లభియింపనప్పుడా ప్రేమము తొంటిదాని విడి రెండవదానికె తత్తఱిల్లు; నౌరా! మును దా సమానముగ నర్మిలి చూపినవస్తుజాతమందేమయినం బదార్థ మొక టెట్లొ నశించిన, నున్నవానిపై ప్రేముడి యంతయేక మయి పెర్మిగఁబోయినదానిమీఁదఁ బోరామిని జూపు; నైనను దిరంబుగ నెందును నుండఁబోక యీ ప్రేమము చంచలంబయి చరించునటంచును గొందఱందు; రిందేమియు లేదు తాను వరియించినవస్తుల మార్పుఁబట్టి యీ

ప్రేమము మాఱునంచు వివరింతురు గొందఱు; మాటిమాటికిఁ
బూమెలు దాల్చు దీని కొకపున్నెము నన్నెము మంచిచెడ్డ యు
న్నెమము లేదు నింద్యము ననింద్యము సాధ్యమసాధ్యమొండు గాఁ
బ్రామిడియై తలంచి పయివ్రాలడు, నొక్కనికై మఱొక్కనిన్
బాముఁలఁ బెట్టు, దీని నెడ నమ్మిన మోసమటంచుఁ గొందఱుఁ;
బ్రేమయె జీవయాత్ర నడపింపఁగ మూలము దాన నింద్రియ
స్తోమము మోహ మందుననుచున్ మఱికొందఱనందు; రింతయే
లా మఱి! తీఁగ తీసికొలందిని డొంక చలించునన్నయా
సామెత నిక్క మయ్యె మనచర్చకు వచ్చిన ప్రేమఁగూర్చి యే
ట్లీమహనీయచర్చ మది కెక్కునొ చూతము ప్రాజ్ఞకోటికిన్?

— ప్రేమస్వరూపనిరూపణము —

అద్వితీయైకపరమేశ్వరాభిలాష
జనితమాయాప్రపంచనిసర్గమైన
వాఙ్మనసకాయకర్మప్రవర్తనముఁ
బ్రేమ మాలంబ మనుట వివేకిమతము. 23

అరయ నాప్రేమ కాశ్రయం బగు మనస్సు
గాన దానిస్వరూపంబు గాంచి పిదప
నాశ్రయాశ్రయిసంబంధ మనుసరించి
దాని కబ్బినగుణములు గాన నగును. 24

బుద్ధియు నహంకృతియుఁ జిత్తమును మనస్సు
నాఁగ నంతఃకరణమొప్పు నలుఁదెఱఁగుల
నందు మనస్ప్రేమ కాశ్రయమైన మనసు
నేకరణి నిర్వచించిరో యెఱుఁగవలయు. 25

ఆరయ నశరీరవ్యవ
హారుం డగుపురుషునింద్రియంబుల కెల్లన్
శారీరకమీమాంసా
సారజ్ఞుఁడు పల్కు మానసం బధిపతిగాన్ 26

(1) కామసంకల్పవికాల్పాత్మకం బయి
ధర్మార్థసాధనాధార మగుచు
సుఖదుఃఖములకును జో టగుచుండియు
(2) సకలేంద్రియ ప్రవర్తకము నగుచు,
(3) శాంతివైరాగ్యా దిశాంత వృత్తులకును
రాగలోభాది ఘోరంబులకును
మోహభయాదిక మూఢవృత్తులకుఁ బ
దంబును (4) జ్ఞానసాధనము నగుచు

---

(1) కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మనః—ఇతి శ్రుతిః

(2)-(4)-న్యాయమతము. (3) సాంఖ్యమతము.

నంతరింద్రియ మగుమన స్సలరు ననుచు
నిర్వచించిరి వేత్త లానిర్ణయమున
నన్నివృత్తుల నిమిడినయట్టి ప్రేమ
కారణంబులు కలుగుట యబ్బురంబె? 27

ఆమన సె యంతరింద్రియ మనఁగ హృదయ
మనఁగ మానస మనఁ జిత్త మనఁగఁ బరగి
కర్మబంధ మోక్షములకుఁ గారణంబు
గాఁగఁ బ్రేమంబునకు మూలకంద మయ్యె 28

మఱియు నమ్మానసంబు తామసము రాజ
సంబు సాత్త్విక మగుచుఁ దత్సంకులంబు
నగుచుఁ బ్రాక్తనసంస్కార మనుసరించి
తత్తదనురూప విషయ ప్రవృత్త మగును. 29

అట్టిత్రిగుణాత్మకం బైన యంతరంగ
మెందు చొచ్చిన నది ప్రేమహేతుక మని
సకలలోకాను భూతదృష్టాంత సరణిఁ
దరిచి చర్చింపఁగా నిజ మరయవచ్చు. 30

హృదయము నంటి యుండుటఁదదీయగుణంబులు ప్రేమకబ్బఁగా
నదియును దామసాదికగుణాంచితమై బహువేషధారియై
యెదఁ బొదిగొన్నయట్టి వివిధేచ్ఛల కుద్భవబీజమై తదా
స్పద మయి యింద్రియంబులు వశంబులుగావిహరించునెల్లెడన్

సరవి నది తామసంబు రాజసము సాత్త్వి
కంబు సద్వయ మద్వయాకార మనఁగఁ
బంచవిధ మయ్యు బహుళభంగిఁ బరగుచుండు
వరుసఁ దల్లక్షణంబుల నరయవలయు 32

మదమోహమాంద్యాదిమలిన మైనట్టిది
తామసప్రేమ నాఁ దనరుచుండు
మత్సరలోభకామక్రోధకలుషంబు
రాజసప్రేమనాఁ దేజరిల్లు
భక్తిధర్మజ్ఞానభాసురం బైనది
సాత్త్వికప్రేమ నా జగతి వెలయు
జీవేశ్వరవిభేదభావప్రసిద్ధంబు
సద్వయప్రేమ నా సందడించు
విమల మై భాగ్యసదసద్వివేకమూల
శమదమాదికసాధనసంపదుదిత
మహితమహిమాత్మధీభాసమాన మైన
దద్వయప్రేమ యగును సోఽహ మ్మనంగ. 33.

తామసరాజసములు ధర
నేమండల మెల్లయెడల నిండుట ము న్నా
ప్రేమంబులబహుగతు లగు
బూమెలు వివరింతు లక్ష్యపూర్వకఫణితిఁ 34

ఇంద్రియ సుఖంబులకుఁ బ్రాణియింద్రియంబు
లెల్లవిషయంబులందు ప్రవృత్తి గాంచు
నదియె రాజసగుణ మయ్యె నందు గలుగు
మంచిచెడ్డలు గనమి తామసగుణంబు 35

కాన బహువిధవిషయసుఖప్రవృత్తి
గాంచి రాజసతామసాకార మగుచు
లౌకికప్రేమ యొప్పుఁ దల్లక్షణంబు
లుభయనామంబుల నభేద మొందు నిందు. 36

జనక పతి దార తనయాదిజనుల యందు
నొక్కరొక్కరి కొకరిపై నున్నయట్టి
లరయవచ్చెడిప్రేమ మాత్మార్థ మగుట (1)
సహజసిద్ధంబ యగు నరజాతి కెల్ల. 37

అరయ ననాద్యవిద్యానిమిత్తంబును
జన్మపరంపరాసంగతంబు,
దారపుత్రాద్యన్యధర్మంబులును దేహ
ధర్మంబు లింద్రియధర్మములును
దనయందు చూచునధ్యాసభావంబున
సిద్ధమై యాజన్మసిద్ధము నగు

(1) "తత్ప్రేమాత్మార్థ మన్యత్ర నైవ మన్యార్థ మాత్మని"
విద్యారణ్యులు.

నేను నా దనియెడిమానవవ్యవహార
మంతటఁ బ్రత్యక్ష మగును గాదె?
అట్టినైసర్గికవ్యవహారమునకు
బీజ మాతామసిక మైనప్రేమ గాదె?
యట్లగుట సాజ మైహిక మైనప్రేమ
సర్వ మాత్మార్థ మనుట విస్పష్ట మయ్యె. 38

ఇట్టి దయ్యును సాత్వాంశ మించుకంత
యందు నందును గన్పింప నలరి, రాజ
సంబు తామస ముభయమిశ్రంబునైన
ప్రేమనై చిత్రి జగ మావరించె నిట్లు. 39

## నైసర్గిక ప్రేమ

జీవుఁడు పూర్వజన్మమునఁ జేసినచేఁతలమంచిచెడ్డలు
ర్వీవలయంబునం దనుభవింపకతీఱనిదానఁ దా నవి
ద్యావశవర్తియై జనన మందుచునుండును గాని యొక్కఁ డిం
గావఁగ నొక్కఁడింపొడఁగుఁగాంచఁడటంచుమురుతత్త్వకోవిదుల్.

తల్లికడుపునఁ బడినట్టితఱిని జీవి
తనదు కర్మంబునకుఁ దగుతనువు దాల్చి
యాశరీరంబు దానుగా నవనిఁ బుట్టు
నదియె దేహాత్మబుద్ధి మాయాగుణంబు 41

కావున నాత్మ(ప్రే)మము
జీవుల కాగర్భవాససిద్ధం బగుచుఁ
భావింప నేక మయ్యును
వేవితములఁ దోఁచుచుండు విచిసినకొలఁదిన్ 42

ఒకనిముసంబు తల్లిఁ గనకుండిన నెంతయుఁ బోరు పెట్టుపి
ల్లకుఁ గలభావమేమి? తను లాలనచేయుచుఁ బా లొసంగి యె
త్తికొనఁగఁ దల్లి వచ్చునను తెలివియే కద! కాకయున్న మ
చ్చికపడి దాదిచెంతకును జేరునె? దానికి నట్టులేర్పునే? 43

తెలియఁగఁ దానుగానిదగు దేహము దానుగనమ్మి దానికై
పలువిత మైనరక్షకు నుపాయము లెంచుచు నింత కాలిలో
ములు దిగనేని పోయె నని మొత్తలు వెట్టుచు వచ్చుకష్టముల్
దలఁపక యాశరీరము యథార్థముగాఁ దలపోయుచుండఁడే? 44

తనువు శాశ్వత మని నమ్మమనుజులందు
తనువు తొఱఁగిన జీవులతనువు లిందు
కనఁగరాకున్కి నిచ్చలు గనుచునున్నఁ
దనతనువు నిక్క మనుభ్రాంతి తలఁగునొక్కొ? 45

కలిగినలేకయున్నఁ దనకాంతసుతుల్ తలఁగూర్ప్రాఁగాను బెం
దులకని? తా సుఖాంబునిధిఁ దోఁగుటకే కద! కానివారు వా
రలు గతియించిపోవ వనరం బనిరేమిటి? తదాత్మసౌఖ్యముల్
తలఁగిన వన్న దుఃఖముకదా! కనుఁ డింతలి ప్రేమతత్త్వమున్ 46

కారణ మిట్టి దైనమనుజగంబునఁ బెక్కురు ప్రేమమూఢులై
దారసుతాదిపోషణవిధానమునం బడరానిపాట్లు వే
సారుచు నాత్మసౌఖ్యలవసంగతి లేకయు తాము వారికై
ధారణిఁ బుట్టినట్లు పరితాపము నొందక చచ్చునంతకున్. 47

ఈవిచారణ యి ట్లుంచి యింక నిప్పుడు
ప్రేమవైచిత్రి మున్ను చూపింపఁదలఁచి
చదువరుల కొక్కమాట యీసమయమందు
మనవిచేయుచున్నాను మఱవరాదు
తనకుఁ దనయందు నొరులయందును గనఁబడు
వివిధమైనట్టి మనుజునిప్రేమ మెల్ల
తలఁప నాత్మార్థ మగుట సత్యంబ యయ్యుఁ
గార్యవశమున వేఱు గాఁ గానవచ్చు
నంతమాత్రాన నన్యార్థ మగు నటంచు
ననఁగరా దనునదియ నామనవి, యింక
శైశవం బాదిగా దానిచర్య లెల్ల
నరయఁగాఁ దగు లోకంబు తరిచి తరిచి. 49

## — శైశవప్రేమ —

కూర్కి లేచినవేళకును దల్లి పక్కలోఁ
గనరానిచో మోము గంద నేడ్చు,
తల్లి రాఁ జూచి పాదంబు లాడించుచుఁ
జిఱునవ్వుమోముతోఁ జేతు లెత్తు

చేతులు చాచి 'దాదా' యనంగఁ బ్రాఁ
కుచుఁ బోయి యొడిలోనఁ గూరుచుండు,
పని చేసి వచ్చుతల్లిని జూచి పర్వెత్తి
కదిసి నవ్వుచుఁ గాళ్ళు గౌఁగిలించు,
ఎంత మఱపించినను దల్లి యెచటి కేవ్రుకు
వెడలునో యంచు నెప్పుడు వెంబడించు,
ఎండ జెల్లేమి చేసిన నీసడించు,
సర్వమును దల్లియే యంచు సంతసించు. 50

తండ్రి దవ్వులఁ గని తమకించి పరుగెత్తి
కలకల నవ్వుచుఁ గలియఁబోవు,
ఆతఁ డెందుల కేని యరుగుచో దైన్యంబు
గదుర నెక్కడి కంచుఁ గదిసి యడుగు,
తినడానికి మిఠాయి తెత్తువా యిప్పుడే
వత్తువా యని వెంటఁబడుచు నడుగు,
తులకించు తొక్కుపలుకులు పలుకుచును వేడ్క
వచ్చి నాన్నా యంచుఁ బక్కఁ జేరు,
తండ్రి పొరుగూరి కేగినతఱి మాటి
మాటికిని నాన్న యేఁడి యమ్మా! యటంచు
నడుగు, నీరీతిఁ దలిదండ్రులందు చిన్న
బిడ్డలకు సాజముగ నుండు ప్రేమ గనమె! 51

జనకులఁ బిల్ల లట్లు సహజంబుగఁ గూర్మిని జూచినట్లుగాఁ
గనఁబడుచున్న నందుకును గారణ[1] మాత్మసుఖాభిలాషమే
యనఁదగి యాత్మరక్షకుల నవ్విధిఁ జూచుట యెల్లవారికిన్
జననముతోడఁ బుట్టినది నాఁగ నిదర్శన మౌను జూడుఁడీ.

కనుఁగొనఁ దల్లి లేనికనుఁగందులు దండ్రిని బాసినట్టి నం
దనులును బెంచువారె తమతల్లులు దండ్రులు గాఁగ వారికిం
జన వయి ప్రేమ చూపరె? విచారణ చేయఁగ సౌఖ్యహేతువౌ
జనమునఁ దోఁచునేర్పు సహజన్మగుణం బగు నాత్మరక్తికిన్.

## బాల్యప్రేమ

పసితనం బెట్లు గడవంగ బాలికలకు
బాలురకు నాటలందు నిబ్బరపుఁ గూర్మి
గదురు, నప్పుడు వార లాఁకలియు దప్పి
కేనియును లెక్క చేయక యిల్లు మఱచి. 54

త్రొక్కుడుబిళ్ళ దూదుముఁబుల్ల పిచ్చుక
గూళ్ళు కాళ్ళాగజ్జె కుందికాళ్ళు
వచ్చాకు నరిబెను లచ్చనగాయ లో
ప్పులకుప్ప దాఁగురుమూఁత లియను,
అలఁకి గొక్కు వానాలప్పు గొబ్బిళ్ళు
చిఁటి మొటిక్కిళ్ళు చెమ్మచెక్క

1. "ఆత్మనః స్తు కామాయ సర్వం ప్రియం భవతి" శ్రుతి

గుడిగుడిగుంజాలు గుజ్జెనగూళ్ళును
గుజగుజరేకులు; గోటిబిళ్ళ
కోఁతికొమ్మంచి చెడుగుడి కుండబంతి
పరుగుపంతము లుప్పనఁబట్టె లనెడి
యాటలాడుచునుందు రేపాటనైన
వారివారికిఁ దగినట్లు వారు వారు. 55

వారికి సహజము మధురా
హారంబులకోర్కి మాడ్కి నాటలతమి యా
కూరిమి హెచ్చై యల్లరి
కారంభం బగును దాని నణఁపక యున్నన్. 56

మన మతికోమలంబు వలమానముబుద్ధితదింద్రియంబులున్
దినదినవర్ధమానములు తీవ్రము, లాటలకూర్మి హద్దు దాఁ
టినఁ జెడునేఁతె లబ్బుట కడిందియె వారికిఁ గాన నెల్లు వం
చిన నటు వంగువారిమృదుచిత్తము పెద్దలు వంపఁగాఁదగున్.

గురుజనశిక్ష గల్గినను గొంటెటిచిత్తము మంచిత్రోవకున్
మరలక యున్నచందము గనంబడుచున్నను, జాలమంది బా
లురు తఱితోడిశిక్షఁ బనులుం గులవిద్యలు నభ్యసింపఁ గూ
ర్తురుగద! దాని వాఁతెమిఁ దోఁచినమూఁడవమార్పనందగున్.

## — కౌమారము — ప్రేమ —

అది కౌమారము నిర్విచారదశ విద్యావృత్తికర్మగ్రహా
స్పదకాలంబు వికస్వరామలమనీషాసూనసంబుల్ భవి
ష్యద్వస్థావృథమూలబంధ మగుప్రాయం బందు వారేమి నే
ర్చెదరో దేనికిఁ గూర్తురో యదియ. తచ్చిత్తస్థిరంబయ్యెడిన్.

ఒకనికిఁ విద్యయందు మఱియొక్కనికిఁ గ్రయవిక్రయంబులం
దొకనికి శిల్పమందు నిఁక నొక్కనికిన్ వ్యవసాయమందు నొ
క్కొకనికి దాసులోహవననోపలవృత్తిక్రియలందు వారి వా
రికి మది కెక్కినట్టికలఁ బ్రేమ తగుల్కొను జీవికార్థమై. 60

అఱువదినాలుగుంగళలయందెదినొకకలయొక్కఁ డొక్కఁడున్
గఱచును ప్రీతి, నేకలకుఁ గానివృథామతి చోరకర్మమే
నెఱుఁగును గాని యూరకొనఁ డింత నిజంబు, వివశు సేయ నే
తెఱఁగున నైన దేహముగతిం దలపోయని వెఱ్ఱు లుందురే? 61

ఆకౌమారమునం గుమారకులయభ్యాసంబు లెట్లుండునో
లోకజ్ఞానము వర్తనం బెనయుమేలుం గీడు నట్లుండు, నా
లోకింపన్ ఋజువర్తనంబునకు నెట్లున్ మే లగుం గానఁ దా
మాకాంక్షింపఁదగుం గుమారులు సదభ్యాసంబులే యాత్మలో.

అరయమిఁ జేసి యల్పమతి యాత్మసుఖంబునకెల్లభంగులన్
దొరఁకొనుచుండుఁ గాని సుఖదుఃఖము లెప్పుడు దైవయుక్తిచే

-పోరకొనునంచు నాతనికిఁ దోఁచదు, కావున దైవచింత నే
నరుఁడును సాధువర్తనమునన్ సుఖయత్నము చేయఁగాదగున్.

కొందఱు చిన్ననాఁడు చెడుకూరిమిపాల్పడి బుద్ధిహీనులై
క్రిందును మీఁదుఁ గానక చరించుటచేఁ గడగండ్లమూకులై
వందురుచుందు రెందు నెలప్రాయము వచ్చినవెన్కఁ, గాన నే
ర్పందగు జీవనంబున కుపాయము కోర్కె మెయిం గుమారకుల్.

కొంతమంది కుమారు లత్యంతభక్తిఁ
దల్లిదండ్రులనుడి జవదాఁటకుండ
నిజకులోచితవిద్యలు నేర్చుకొంద్రు
మానసము తత్కలాభ్యాసమయము గాఁగ. 65

ఎవరిచిత్తంబు లేవృత్తు లిచ్ఛగించి
తత్ఫలప్రాప్తి కెంతయుఁ దత్తఱించు?
సకల మర్యాది ప్రేమలక్షణము చూవె
కోర్కు లన్నింటికిని ప్రేమ కుదురు గాదె?

తఱి వేచి బీళ్ళఁ బంతలఁ ద్రిప్పి యుపాయ్యాయి
మృగములకదుపుల మేపువారు
అదను గన్గొని దున్ని పదనార వెదచల్లి
కలుపు తీయుచుఁ జేలు గాచువారు
కొనుగోలు సమ్మకంబును గాంచి ధరవార్త
లెఱిఁగి బేహారంబు నెఱపువారు

పనివానితనము మెప్పును గాంచ బహువిధ
శిల్పకర్మంబులు చేయువారు
నగుచు నయ్యాకుమారకు లాత్మవృత్తి
లభ్యసించుచుఁ గోర్కెమై నందు నేర్పు
గదుర గడిదేఱుచుంటకుఁ గారణంబు
భావికాలాత్మసుఖలాభపరత గాదె? 66

కడఁదీన మగుమాధుకరజీవనంబు గా
వించి వేదములు వల్లించువారు
పరదేశముల కేగి గురుకులావాసక
ష్టము లోర్చి శాస్త్రముల్ చదువువారు
పూఁట కొక్కొకయింటిపూటి కాశించి యా
సించి కావ్యములు పఠించువారు
అరు దైనయొజ్జల నాశ్రయించుచు వాద్య
నృత్తగీతాదులు నేర్చువారు
నగుచు నభిలాష మభిరుచి యభిమతంబు
దీర నావిద్యలం దెల్ల నారితేఱు
వార లెందఱు లే, రందు కారణంబు
భావిసుఖకీర్తిధనలాభపరత గాదె? 67

అని నెఱింగి కుమారకులను
నదమలమతి బోధచేసి చదివించినచోఁ

జదువున మరగినవారల
మది యూరుచి వదలి వెనుక మరలదు కనుఁడీ! 68

రఘువంశరసము నారంభించురసన నై
షధమాధురిం గ్రోల సాగకున్నె
దశకుమారచరిత్ర దరిసించు కన్నులు
కాదంబరీ శోభఁ గాంచకున్నె
శాకుంతలోత్తరచరిత భూషితబుద్ధి
ముద్రాదులను దాల్చి మురియకున్నె
కువలయానందంబు గొనుమది గంగాధ
రప్రకాశంబులఁ గ్రాలకున్నె
దివ్యరామాయణ సరస్వతీమహతి
హాసపారాయణపరాయణాననంబు
మఱచునే బుధసంస్తూయమానచరిత
భాగవత భారతేందిరాప్రార్థనంబు. 69

కనుఁగొన దిక్ప్రదర్శనముగా వచియించితిఁగాని సంస్కృతం
బున ననురక్తి గాంచుమనముం దమవంకకు లాగునట్టి క
ల్పన పదసౌష్ఠవంబు రసభావసమృద్ధియు నౌచితీగుణం
బెనసిన గ్రంథరాజముల నెన్నిటి నియ్యెడ నెన్న నయ్యెడిన్?
అలపెద్దనార్యు తియ్యనిపల్కు లాలించి
భట్టుచక్కని కుల్కుపల్కు లెఱిఁగి

కృష్ణరాయల ప్రౌఢగీర్భావ మూహించి
ధూర్జటివాక్యమాధుర్య మాని
నందితిమ్మన మాటలందంబు తిలకించి
నరసింహునుడులు కర్ణములఁ గ్రోలి
రామభద్రుని వచోరామణీయక మెంచి
రామకృష్ణునివచఃప్రౌఢి వ్రాలి
అబ్బనకవిమనోహరభాష హర్షించి
తిమ్మయ్యవచనసౌందర్య మరసి
శంకరకవివాక్యసంపత్తి గుర్తించి
గౌరననుడువుల గౌరవించి
వేంకటపతిపల్కు విన్నాణములు గాంచి
వేంకటకవివచోవిభవ మెంచి
నారాయణోక్తి ప్రచారచాతురిఁ గాంచి
యితరసత్కవివాక్కు లెఱిఁగి తిరిగి
సూరనార్యుని క్రొత్తసొంపు లింపులు నేర్చి
వీరభద్రునివాణి వినుతిచేసి
శ్రీనాథకవినాథుసింగారములు నేర్చి
పోతనార్యునిభక్తిఁ బూజసేసి
రంగనాథునినవారంభరంగముఁ జొచ్చి
భాస్కరాదులరామభక్తిఁ బొగడి

సోమునిమహిమంబు చూచి చేతులు మోడ్చి
కేతనాదుల మహాఖ్యాతి కలరి
ఎంద ఱెందఱిసూక్తు లింకెన్ని యేని
యరసి వచ్చుకుమారవిద్యానురక్తి
తొట్టతుదకుఁ గవిత్రయధుర్యభవ్య
దివ్యవాణీసుధాంబుధిఁ దేలకున్నె? 73

విద్య నేర్చుట సదసద్వివేకమూల
మైనయాముష్మికంబున కనుట సత్య
మైన నయ్యది ధనమూల మైన కేవ
లైహికంబున కుపయుక్త మగుచునుండె. 74

పరసారస్వతసింధుం దరిచి తద్భావామృతం బాని బా
లురు నిర్నిద్రమతిం బరీక్షలఁ గృతార్థుల్ గా రొకో; కానియొ
క్కరుఁ డెవ్వం డయినన్ సహస్రశతసంఖ్యన్ దానిఁ బ్రేమించిన్
బరమార్థంబున కెల్లవారలయభిప్రాయంబు లిట్లుండఁడే. 75

పురవాసశ్రమ వర్ధనాశనమనోబుద్ధిశ్రమల్ సైచి దు
ర్భరనిర్బంధనిబంధనాంగలకలాభ్యాసంబు గావించుచుం
దురుగా దే యిప్పు డెల్లవారు కలవృత్తుల్ గూడఁ గ్రీడించి, దు
ష్కరసేవాకలితాధికారధనభోగఖ్యాతికామంబులన్ 76

కాని యానందమును గూర్చి మానసంబు
ధనము భోగంబు సమకూర్చి తనువుఁ దనిపి

యలరఁజేయును గాన విద్యానురక్తి
యుఱుతెఱంగుల నాత్మార్థమే నిజంబు 77

— యౌవనము — ప్రేమ —

ఈగతిఁ గౌమారము పడి
వేగిరపడి యౌవనంబు నేతెంచుఁ దనూ
భోగానురక్తి కప్పుడు
తోఁగుదు రెల్లరును గామలోలుపబుద్ధిన్. 78

ఇదియె నైసర్గికప్రేమ మెసయునట్టి
నాలుగవహాలాద్య దీపించుచుండ బహూత
పూర్తి, యిది గాదె లౌకిక పురుషార్థ
కామధామంబు దంపతిప్రేమ మనఁగ. 79

పదునవవాఁడని చక్కఁగఁ
జదివినవా రనుచు శంక సలుపక మగఁడా
మది యని యెంచక యౌవన
మద మెల్లరమనముల నొక్కమాడ్కిఁ గలఁచున్. 80

నవనవోన్మేషమానససారసంబుఁ జిం
దఱచేయు మత్తదంతావళంబు
విద్యావివేకపుష్పితబుద్ధివల్లరి
నూఁచముట్టుగ నూఁచునోరుగాలి

లోకవృత్తాంత మాలోకింప వికసించు
కందోయి బంధించు గాఢతమము
సత్కథాకర్ణనా సక్తకర్ణములోన
శృంగారమంత్రింబు చెప్పుగురువు
వినయనయభయ విధులార్చు వేరుపురుగు
కుటిలసాహసవిధిఁ గూర్చుకుంటెనీఁడు
మంచిచెడ్డలు మఱపించు మత్తుమందు
నగుచుఁ బొడచూపు నభినవ యౌవనంబు. 81

పారవిహీన ముగ్ధత నుపాయపరిశ్రము నైనఘోషసం
సారముఁ జొచ్చు జీవి సహజంబుగ జవ్వనమందు, దానికిం
గారణ మాశరీరసుఖకాంక్షయె దానికి సాధనం బగుం
గోరినకాంత కాంతునకుఁ గోరిన కాంతుఁడు కాంతకబ్బుటల్. 82

పరిణయనిశ్చయం బనెడి భాగ్యము నాటినయట్టి విత్తులై
కరమును బట్టువేళ మొలకల్ వొడమం జిఱునవ్వుచూపులం
బెరిఁగి తలంపు సిగ్గు గనిపించు రసోక్తులఁ బూచి యవ్వధూ
వరహృదయానురాగనవవల్లులు కూడికఁ గాచు నేకమై 83

పాణినాయికమేను బంగారుబొమ్మగా
సింగార మొనరించి పొంగువారు
కాంతాంగవల్లరి కాంచనవల్లిగాఁ
గాంచి యానందంబు గాంచువారు

మంజుభాషిణీపల్కు మాధ్వీరసంబుగాఁ
గ్రోలి మైమఱపునఁ దూలువారు
హరిణాంకవదనయపాంగవీక్షారేఖ
తమభాగ్యరేఖగాఁ దలఁచువారు
పక్వబింబాధరోష్ఠిచుంబనఫలంబు
తనువు లెత్తినఫలముగాఁ దలఁచువారు
గాఁగ జాయానురాగసంక్రాంతహృదయు
లగుచు నానంద మొందనిమగలు గలరె? 84

భావజాతత్రపాబహుమానవలమాన
దరమానవీక్షణోదరములందు
జీవారుణాధరాంచితలాససవిలాస
దరహాసచంద్రికోదరములందు
వరకుందవాసనాభాసమానాసమా
దరవేషధారణోదరములందు
పరిహాసపరిరంభపరిచితాదరచిత్రా
దరనర్మభాషణోదరములందు
రూఢగూఢాతిగాఢసంవ్యాప్త మగుచుఁ
గానవచ్చెడిస్వీయముగ్ధానురాగ
వల్లరులఁ బెంచుననుకూలవల్లభులకు
స్వాదుశృంగారరసఫలాస్వాద మరుదె. 85

తరుణము వేచి కూర్చుసుఖదాయకభోజనపానశయ్యలన్
సరసవచోవిలాసములఁ జందనచర్చలఁ గమ్మతావిక
ప్పురపువిడెంబులన్ వలపు పొంగఁగఁ దన్పుచు మానినీమణుల్
వరులకుఁ గూర్చుచుందు రనవద్యగుణాభరణాభిరామలై. 86

చెలువము దీర్పుమేల్నగలు చీరలు రైకలు లేకయున్న న
చ్చెలిమెయిదాల్చియందమునమించెనొకోయనఁగొందఱంగనల్
చెలువులఁ గూర్మిఁ గాంచి సుఖలీలఁ దేలుదు రెందు నాథులన్
వలచినభామినీమణులు భాగ్యము భోగ్యము లెన్నఁ జూతురే!

కులమును శీలముంబలుకుఁగోర్కియునొక్కటిగాఁగనుత్తముల్
కలసినదంపతుల్ సమముగాఁ జవిగొందురు ప్రేమబద్ధులై
కలిమియు లేమియున్ సుఖముఁ గష్టము నెల్లయవస్థలందు మే
నుల నెడఁబాయునంతకు వినోదవిషాదము లారగించుచున్. 88

ఎంతటికష్టమైనను సహింతురు కూరిమి గల్గుకాంతలుం
గాంతులుఁ గూడి కష్టములు కాఁపురమందునె యందుఁ జిత్తవి
శ్రాంతి యొనర్చుకొంచును బరస్పరభావిసుఖాభిలాష, దుః
ఖాంతమునన్ సుఖంబు గనువాసలు నైజము గావె జీవికిన్? 90

అతికి యతుకనియ ట్లుండు నాలుమగల
యంతరంగంబు లొకటిగా నతుకఁ జాలు
నందనానందరసము డెందంబులారఁ
గ్రోలి సుఖయింత్రు దంపతుల్ కూర్మి వెలయ. 91

కౌఁగిట గూఁతుల నెత్తికొని నెత్తిఁ గొని యాస్య
మున నద్దుకొని ముద్దుగొనెడువారు
లాలారసస్యంది బాలాంగ పరిరంభ
లీలాసుఖంబులం దేలువారు
పుత్త్రికల తళుక్కునవ్వులు చిల్కు తేనియ
లొల్కుపల్కులు విని కుల్కువారు
మందమందానందకంద బాలక్రీడ
లందంబు గని వేడ్క లందువారు

ఐహికాముష్మికసుఖంబు లంద దిక్కు
సంతతులె యంచు నానంద మొందువారు
గాఁగఁ గడగండ్లు పడి వారిఁ గాచునట్టి
దంపతుల పుత్త్రపూర్ణవాత్సల్య మరుదె? 92

ఈమెయివడి నుచితంబుగఁ
బ్రేముడి సత్త్వాంశ మొప్ప వెలయుచు నడుమన్
గామక్రోధగతం బయి,
తామస మయి లోక మెల్ల దందడిఁ బెట్టున్. 93

దారసుతాదిబంధము యథార్థముగా నెఱి నమ్మి వారి కై
వ్యాధికి నెట్టిలోపము సహాయము రాఁదగ దంచు నెన్ని యో
దారుల వారికిన్ సుఖము దార్పఁగ నెంచుచు వారె తాముగా
వారియుపాయమే తమయుపాయము కాఁగనుచుండరే జనుల్? 94

ఒకనికి నొక్కఁడే కొమరుఁ డుండెను బో తన కాకుమారుఁడే
సకల మలంచు వాఁడు గనుసంతస మంమును గాన వానిపై
మకుఁ గుదు రాసుతుం,డతఁడు మై విడనాడినవానిబొంది తం
డ్రికిఁ గనుపట్టు నెల్లపుడుఁ బ్రేమపుటుయ్యెలనూఁగులాడుచున్.

కొమరులు నల్వురుండిరనుకొందము వారలలో నొకండుకా
లముగతి నొంది తండ్రియుదిలం గన నాప్తులువచ్చియున్నయీ
కొమరులఁజూచుకొమ్మ మదిఁగుందుచుమన్న నుబ్రేమసూత్రబం
ధముమృతపుత్రుతోఁబితయెదన్ మఱియింతబిగింపకుండునే? 96

తనయుఁడుతప్పుదారిఁబడి ద్రవ్యముదుర్వ్యయమాచరించుచుం
డన కపకీర్తితెచ్చెననితండ్రివగన్ విసుగెత్తి "వీఁడు చ
చ్చిన మఱిచావని" మ్మనుచుఁ జేరఁగ నీయఁడుకొంప కప్పుడా
చెనఁటికిఁ గీడు మూఁడెనని చెప్పినచోఁబిత పర్వులెత్తఁడే? 97

పిల్లలు తీవ్రరోగపరిపీడన మొందినవేళ వారిపా
మ్మెల్లను వెంకటేశ్వరున కిచ్చెద మంచును జబ్బు మళ్ళినన్
జల్లఘటంబు మేకలను జాతర కిచ్చెద మంచు దేవికిన్
దల్లులు మ్రొక్కుకొందురుగదా! కనుఁడీతనయానురాగముల్.

## —◆◆◆ గాఢప్రేమ ◆◆◆—

ఒకయెడ నాటిన ప్రేమం
బకలంకము గాఢమును నహార్యము సహజం

జకుటిలమై యొప్పుచు వె
న్కకు వెండియుఁ బోవు దానికార్యము గనుఁడీ. 99

మరణము డాసినంత నొకమానిని భర్తపదంబు లంటి మీ
చరణసరోజసేవ నిహసౌఖ్యము గాంచుట యింక తీఱె, మీ
స్మరణమె యింక నాకుఁ బరసౌఖ్యమొసంగెడునంచు బాష్పసం
చరదనురాగదృష్టిఁ గడసారిగఁ గన్గొని చేరె నాకమున్. 100

వరమతిశీలవృత్తసమభావసమంచితదంపతిద్వయిం
బరమపదంబుఁ జేరె నెలప్రాయమునం దలసాధ్వి యానతీ
విరహవిషాదసాయకవిభిన్నమనస్కుఁడు నామెదీర్ఘనుం
దరనయనానురాగకలఁ దత్పతియుం గనుచుండు నెప్పుడున్. 101

ఒకపిఱు పెదవాఁడు మృతి నొందిన ప్రేయసి దేహ మేటియం
తికమునఁ బూడ్చి యం దరుఁగు దీర్చి నిచ్చ గడించు కూలి నిం
చుక నొకపండు పూలుగొని నూనెనుగూడి దినాంతవేళ వే
దికకడ కేగి యందిడి సతిన్ స్మరియించు సదెట్టికూర్మియో.

తరుణవయస్కుఁడుత్తముఁడుదారమనస్కుఁడుపుత్రుఁడర్థసం
భరితుఁ డొకండు సాధ్వియగుభార్య గతించినయంత వెండియున్
బరిణయ మాడ కాత్మసుఖవాంఛలనన్నిటి పీటిఁబుచ్చి యా
మరణముఁ దత్సతీసహితమానసుఁడయ్యె సదెట్టిప్రేమమో. 103

ఒకమగనాలు తన్ను వల పుట్టిపడన్ సుఖపెట్టినట్టి భ
ర్తకు విషమజ్వరంబు స్మృతితప్పఁగ వచ్చుట చూచి చూచితా

ప్పక మరణించు నంచు భయవారిధిమున్గి యుఁ శేలయుంచు నం
తికమున నున్న నూతఁబడి దేహముఁ బాసె నదేమి ప్రేమమో!

వరమతి పుణ్యశీల పతివత్ని యొకర్తు నొక్కకూర్మికూఁ
తురు గలదామె విద్యకయుమారమునన్ వసియించెఁ గూఁతుపి
త్తరువుఁ జూచి తృప్తిపడుతల్లియు నున్నటులుండి పుత్రికా
మరణవుజాబుఁ జూచి నది మై విడనాడె నదెంత ప్రేమమో?

చెలువము లేని దంచుఁ గులశీలసమన్విత యైనకాంతతోఁ
గలయికమానియొక్కఁడొకకన్నియ వెండియుఁ బెండ్లియాడె నం
దుల కయి కుంద కానతియుఁ దొంటిగతిం బతిసేవ సేయు చ
గ్గలముగఁ గొన్నియేండ్లకును గాలము చేసె నదెట్టిభక్తియో?

## దుష్టప్రేమ

ఒక్కొకయెడ ననుచితమై
మ్రుక్కడియై యంధ మగుచు మూఢుల నణఁగం
ద్రొక్కుటె కాదీ ప్రేమం
బక్కట చెలరేఁగి ప్రాణహానియుఁ దెచ్చున్ 107

ఒకఁడొకకన్నియన్ వలచియుండును దానికి వానిమీఁదనిం
చుకవలపైన లేదతనిచొప్పు నెఱుంగదు కాని వారలొ
క్కొకయెడఁ దారసిల్లి తము నొండొరుఁజూచెడిరీతి నైనదా
నికి వలపేమి లేమి గననేర్చునె యాతనిగ్రుడ్డిభావముల్? 108

వారవధూటిమక్కువకుఁ బాల్పడియొక్కఁడు దానికుల్కలం
దీరినవల్కులన్ బ్రమసి తెచ్చుచు నిచ్చుడు నోజ జీవనా
ధారము లేక పేదవడి, దానికృపం గనఁ జూచి చూచి వే
సారియు దానిపంచ కొకసారియుఁ జేరక నిల్వఁజాలు నే? 109

ఎఱుఁగును దోసమంచుహితులెల్లరు నందురుకూడదంచు వే
తెఱఁగుల, దాన నైన పరధిక్కృతితాడనమర్దనాదులం
దఱచుగఁ బొందుఁ గాని పరదారసమాగమలోలబుద్ధి యా
వెఱపున జంకునే వలపు వీడునె? కంఠముఁ గత్తి డాసినన్ 110

పరపురుషాభిలాష యగుభామిని భర్తకుఁ గూర్చునట్టులే
పరవనితాభిలాషుఁ డగు వాఁడును భార్యకుఁ గూర్చు నప్పుడ
య్యిరువురువారియిర్వురపయిం దమిగల్గి రసంగఁ దోఁచు, లో
నరసిన వారియాత్మసుఖమందలిప్రేమ మొకండె తోఁచెడిన్

ధనములఁగాఁతలందు బహుధా పచరించెడిప్రేమలోకనుం
దన విన రానికార్యముల కాకరమై నయ పుణ్యహీన వ
ర్తనమున హద్దు మీఱి భయదంబగు చోర్కొకపట్టునందు కో
పన మయి జీవనంబుల కపాయము తెచ్చుచు నున్కిగానమే

పరవనితానురాగరసపంకిల మానసుఁ డైనమూర్ఖుఁడా
తరుణిపతిన్ వధించిన సదా తనకోర్కి ఫలించు నంచు న
చ్చెఱవనచేటనమ్మతి నసిం గొని యంతనె యడ్డగించి ని
వ్వెఱపడుదానిఁ గొట్టు, తెగవ్రేసెనుదత్కృతినెట్టిప్రేమమో! 113

తనయులఁ గన్నయొక్కవనితాతిలకంబు నిజానురాగభా
జనుఁ డగుభర్త నొక్కవ్యభిచారిణికౌఁగిటఁ జూచి రోసి యీ
మనఁ బతిఁ గిన్కఁజూచి చనుచో విటకర్త్రియు నామెఁ బట్టి కొ
ట్టెను బతి చూచుచుండఁ గనుఁడీ యనురాగవిచిత్రవేషముల్

తనకామించిన నాతి యింకొకనిచేతం జిక్కుటం జూచియా
తనిమీఁదం బగ దానిమీఁద వలవంతం బూని కామాంధలో
చనుఁడై క్రిందును మీఁదు గానక యవజ్ఞాలబ్ధసంరంభకో
పనుఁడై యొక్కరుఁ డాతనిం బనిచె రంభాసంగమప్రాప్తికై.

ఒక యధమాధముండు తనయుంపుడుకత్తె 'ధనంబులేనివా
నికి వెలయాలు లేదనట నిక్కమొకో' యనిపోటుమాటలం
బకపక నవ్వ, లజ్జపడి వచ్చి ధనఁబును బిగ్గపట్టు తం
డ్రికి విషమిచ్చి చంపెఁ గనుఁడీ చెడుకూరిమి యెంత చేసెనో!

జారిణులందు మక్కువను జారులు, జారులయందుకూరిమిన్
జారిణు, లిట్లె యన్యులను జంపుట వీనుల సోఁకుచుండు, నీ
దారుణకృత్యకారణము తామసరాజసనీచభావ మీ
ఘోరపుఁబ్రేమ కేపనులు గూడనివో యిఁక నెంచిచూఁడుఁడీ!

వరగుణసత్త్వకంబు గలవల్లభు నొల్లక యన్యుఁ గోరుదు
శ్చరిత యొకర్తు కోర్కి కొనసాగుటకై నెలపైఁ బదేనువా
సరములు మంచ మెక్కి పతిజాలిని గన్గొని కోర్కి దీర్ప న
వ్వైరవిడి నొట్టుపెట్టుకొన వేఁడెను గూర్మికి నెగ్గుసిగ్గులే? 121

చదివినవార లిట్టివని సల్పఁగఁ బోరని మెంచఁ బోకుఁడీ
చదువన మంచిచెడ్డల విచారణయే యగు నట్లుగానిచో
నది యొక సాధనంబ యగు నన్యులఁ గన్నమొఱంగ నీచదు
ర్మద మగుప్రేమ, కట్టి దెదురం గనరాదొకో యెల్లవారికిన్!

చదివినవారు లోకమును జక్కఁగఁ జూచినవారు కొందఱ
మదమలినంపుఁబ్రేమ నవమానము నెన్నక యన్యకాంతలం
గదియఁగఁ బోయి వచ్చుచు నొకానొకపట్టునఁ గాలుసేతులుం
గదలఁగ రానిదెబ్బలకుఁ గాయము లీయరె వీథి కెక్కరే?
మదమలినాత్ముఁడొక్కఁడుకుమారులుభర్తయుఁ గల్గియేఁబదేం
డ్లొదవిన దానిమాయఁబడి యుత్తమశీలను ముగ్ధ "సేవసే
యుదు నెదురాడఁ బోనిచటనుండఁగ నిం"డనికోరుపత్నిఁదా
నదయతఁ గొట్టిపంపె నకటా! కనుఁడీయనురాగ పద్ధతుల్.

తెలిసిన మూర్ఖుఁడొక్కఁడుపతిం బెడఁబాపి యొకర్తెఁదెచ్చినె
వ్వలవునఁజూచుచుండి, పతివచ్చిన, దానిని జూడనీక పెం
దలకడ సాగనంపుచు ముదంబుగనుండెను నాలుగేఁడు ల
వ్వలఁ దనభార్య రాఁదఱిమివైచెను మిండతె నెట్టికూర్మియో!

అలుకను నన్యసించునొకయస్థిరచిత్తుఁడు వెన్క నాలు బి
డ్డల నెడఁబాయుటం గటకటం బడుచుం బదియేఁడు లల్లె ద
వ్వలఁ బడియుండియుం దుదకుఁ బుట్టగతుల్ చెడ నిల్లుచేరియా
కులపడుమానినిం గదియఁగోరెను గంటిరె ప్రేమచెయ్దముల్.

కౌమరునికిన్ ధనంబు సమకూర్పఁగ నొక్కఁడు సన్యసించి పే
శమునధికారియై నలుగడం జరియించుచు సద్వ్యయోపదే
శము బొనరించుచుం దనదుసన్నిధిఁ జేరినభక్తురాండ్ర మూ
లమున గడించుమూట పదిలంబుగ వానికిఁ జేర్చెఁ గూరిమిన్.

మమతఁ దొలంగకున్నఁ దనమానినిఁ బుత్రులఁ బెంచునట్టిక
ష్టమును భరింపలే కొకఁడు జందెము జుట్టును దీసివైచి దే
శములు తెగించిపోయి ధనసంగ్రహముం బొనరించితొంటియా
శ్రమమునవారిపెండిలికి సాయపడెం గనుఁడెట్టికూర్మియో! 126

ఇఁక నొకఁ డాలిపైఁ గినిసి యొక్కఁడికోచని సన్యసించి త
న్నొకనిమునంబునే నరయకుండఁగఁ జాలనికన్నబిడ్డలం
దకుటిల మైనప్రేమ విడనాడఁగఁ జాలక రొందుజందె మొ
ద్దిక మెడఁదాల్చివచ్చెఁబెనతిర్మలకేగితినంచుఁ జెప్పుచున్.127

—•◆• ధ న ప్రే మ •◆• —

జగ మంతయు ధలమూలం
బగుఁ గావున ధనమునందు నఖిలజనులకున్
దగులము నైజం బయ్యెది
తగు నిది తగ దనెడినీతిఁ దలపోయ రొకో? 128

వినయదయానయాలయవివేకము శూన్యము గా నధర్మవ
ర్తనము నసత్యభాషణ మదక్షిణవంచన మూఁతే గా ధనా
ర్జనపరమార్థసాధనవిచారణ చేయుచు నుందు రెందఱో
ఘనులు మహానుభావు లధికారులువిద్యలెఱుంగువారునై.129

కనులం గప్పును గన్నుగ్రుచ్చు మతివైకల్యంబుగల్గించునిం
దను రావించును గిన్కఁ జూపు నెద సంతాపంబుగావించునిం
కను వేయేలొకొ? తిట్టఁ గొట్టు మఱిపైగాఁ జంపనుం జంపునై
నను లోకంబు ధనంబుపైఁ దమకముం దప్పింపఁగాఁ జాలునే?

పరుసఁదనంబు చూపి పరవంచనచేసి యసత్య మాడి పా
మరుల నణంచి యన్యులకు మచ్చరమెచ్చఁగఁ జేసి దుష్క్రియా
చరణమె వృత్తిగాఁగ ధనసంచయముం బొనరించుచుండరే?
యరయ ధనానురాగ ముచితానుచితార్థవిభేద మెన్నునే? 131

రేపును మాపుగూడి కడుజివ్వల నాయువుపోవు,శక్తియున్
రూపము జవ్వనంబు మతి రోగజరాదులఁబోవు, భార్యయున్
బాపలు బంధుమిత్రు లెడఁబాయుదు రయ్యయిపట్లఁగానియా
పాపధనానురాగ మెడఁబాయునె దేహిని జచ్చుచుండినన్? 132

ధనముం బ్రాణముకంటెఁ దీపిగ సదాధ్యానించుచున్ నిత్యముం
గని యాసంచులు తృప్తిఁగాంచునొకఁ డుగ్రవ్యాధికిం జిక్కి మా
టనుఁగోల్పోయి యెగాదిగం గనుచుండన్ మూఁడునాళ్ళంత నం
దను లాసంచులు పక్కఁ బెట్టిరతఁడంతం బాసెఁ బ్రాణంబులన్.

వడ్డికి వడ్డి దానికిని వడ్డిని గట్టి ధనంబు గూర్పఁ బే
ర్వడ్డనొకం డనేకులచరస్థిరముల్ దిగమ్రింగి యూరికిన్
గొడ్డగ మాచు వడ్డితమిఁ గూళకు నప్పిడి వానికొంపయున్
దొడ్డియు లాగి యూరికడ తోఁటనెచిత్రవధంబు పాల్పడెన్. 134

కాయక్లేశము చేసి వెచ్చమునఁబోఁగానూఱురూపాయలా
పాయం బొక్కఁడు దాఁచి నిచ్చలును సందర్శించుచుండంగనే
యాయర్థంబు హరించె వాఁడపుడు 'డబ్బాదమ్మిడాపోయెనం
తా యింతా' యనుచంతమొందెగతనిద్రాహారుఁడైకొంతకున్.

జనకు మొఱంగి రోవెలఁదిసంగడికాఁడయి యప్పుగోరి వ
చ్చినయొకమూఢు నొక్కరుఁడు చేరిచి కోరినయప్పు డెల్ల ని
చ్చినపదు లెల్ల వందలుగఁ జేసియు వందలు వేలుచేసి యా
తనిపొల మెల్లఁ గైకొనెఁగదా! కనుఁ డీధనకాంక్షమెట్టిదో?

ఖలు లగుకొంద ఱాచెఱకుఁగట్టెలలోపలఁ జొచ్చునెట్టచీ
మలవలె జారచోరగణమధ్యముఁ జొచ్చి తదంతరంగముల్
దెలియుచు నొప్పు పుట్టువిగతిం జరియించి తదర్థసారముం
నొలిచి రసంబు పీల్తురు గనుండు ధనంబునకూర్మియెట్టిదో? 137

అప్పులుదీర్చకుండఁ దనయాస్తిని గావఁగఁ గోరి నీతికిం
దప్పి యొకండు వేఱొకనిదగ్గఱ దాఁపఱికం బొనర్చి, యొ
క్కప్పుడు దాని నిమ్మనిన, నాతఁడు మెల్లగఁ గల్లమాటలం
జెప్పి హరించె, సొమ్ముతమి చేయువిచేఁతలు గానవచ్చునే? 138

కత్తులు చేతఁ బూని చని కన్నము వేయుట, దారిగాచి నో
రెత్తిన నెత్తిగొట్టి నిలువెల్లను దోఁచుట, తొప్పకత్తె లై
యెత్తుట, దొంగసాక్ష్యముల కేగుట, జిత్తులతొత్తులౌట, యూ
వృత్తులు లేనివారలకు వృత్తులుగూర్చుధనేచ్ఛఁ గాదొకో? 139

ఒకఁడు ధనంబుఁ దన్నుఁ దనయుగ్మలి నొక్కగతిం దలంచు, భా
ర్యకు రుజ వచ్చెనేని ధన మంతయుఁ బోయిన వంత లేదు దీ
నికి మృతి దప్పె నేని యను, నిక్కముగా నటులైన, వాఁడు భా
ర్యకు మదిఁ గూర్చుఁగాని ధనహానికి నెంతయుఁ గుందకుండునే?

అట్టులె యాలికిం దనకు నామయ మొక్కట వచ్చెనేని యా
ప్పట్టున దాని దేహగతిపై దిగులొందుచునున్న వంతకున్
రెట్టిగ నాత్మదేహగతి నెవ్వగ లొందుచునుండు వంతలోఁ
బెట్టెలు వొంగ దోఁచ విలపింపఁడొకో తనకంటె ముల్లకై?

కాంచనయోగమందు తమిగాంచిన యోగులు స్పర్శవేధిచేఁ
గాంచన మౌను లోహ మనుకల్పము చెప్పిరి గాని పూర్ణజీ
వాంచితుఁ డైనమానవుని యాడల నందలిసాధనంబుగా
నెంచిన ఘోరకల్ప మెవ రేనియు విన్నదె కన్నదే యిలన్!

క్రూరులంగొందఱొక్కనిసిఁగూడి దయారసశూన్యబుద్ధిబం
గారము చేయుబుద్ధి నొకకాఁపుతలం దెగఁగొట్టి కుండలోఁ
జేరిచి దానిఁ బాదరససిక్తముఁగా నొనరించి భూమిలోఁ
గూరిరి చూడుఁ డాపసిఁడికూరిమి యెంతటిఘోర మైనదో!

ఖలమతియైన యట్టివిటకర్తయొకర్తుక మిండగాండ్రరూ
కలఁ దనివోక ప్రొద్దున నొకానొకభూసురునిల్లు సొచ్చి రోఁ
కలి గొని యొంటి నున్నతనికన్నియ నెత్తి పగిల్చి కంటె కా
సులు హరియించె మొన్న, నిఁకఁ జూడుఁడు దుర్ధనకాంక్ష యెట్టిదో

తమవయివారిఁ గన్మొఱఁగి దగ్గఱఁ జేరినవారియొద్ద లం
చములు గ్రహించిబందుగులచాటునభూములు విల్చువానితోఁ
దమయధికారవృత్తులకుఁ దప్పినవారిని జూచి యైన లం
చములు గ్రహింపకుండిరె? విచారణయుండునొకో ధనార్థికిన్?

దురితముఁజూడఁబోరు జనదూషణమెన్నఁగఁబోరు కాళికే
శ్వరి తమయిష్టసిద్ధుల నొసంగు నటంచుఁ దలంచి శక్తికిన్
గరకరిఁ గోడి గొఱ్ఱెలను గానుక యిచ్చుటయే! లభించినన్
నరబలి కూడ నిత్తురు ధనంబునకూరిమి కన్న గానునే? 143

## — వ్యసనములు — ప్రేమ —

వెలఁది జూదంబు పానంబు వేఁట యనెడి
వ్యసనములఁ బ్రేమ కామదోషావిలంబు
పరుషవచనార్థదూషణపరుషదండ
నాభిరతి యెన్నఁ గోపదోషావిలంబు. 144

పరసతిఁ గోరి రావణుఁడువాలియుఁ,బానముచేతయాదవుల్
పరుసపుమాటఁ బౌరవులు, పాపపువేఁటను బాండురాజు పం
క్తిరథుఁడు; జూదమాడఁగ యుధిష్ఠిరుఁడు న్నలుఁడర్థనిందతోఁ
దర బలిచక్రవర్తి, కడుదండన మాగధుఁ డెగ్గు చెందరే ?145

ఈయువకావ్యముల్ నరుల కిట్టిఫలంబు లొసంగునంచు రా
మాయణభారతాదు లనయంబును మొఱ్ఱలు వెట్టుచున్న నీ
హేయకృతుల్ వొనర్చుమతిహీనులపాటులు చూచుచున్న, వి
ద్యాయుతులైనవారిమతి యైనను వీటిని గోరకుండునే? 146

ఆఁకలి నీరువట్టు నణఁగారు దయారస మింకిపోవుఁ, జెం
జీఁకటి గ్రమ్మినట్టులు నశించును దృష్టి, పణంబు రాకయుం
బోకయుఁ గానరాదు, చెడిపోవుట బుద్ధియు నాలుబిడ్డలన్
సోఁకదు, జూదపుందమిని సోఁకని దుర్గుణ మొక్కటున్నదే

అలవడెనేని యొక్కపరి యాచెడు జూదము నాడ నెంతవా
రలమన మేని ముందు గనఁబో దనుచోఁ బరమప్రమాణమై
నలుఁడును ధర్మజుండును గనంబడుచుండఁగఁ ద్రాగుఁబోతునీ
చులహృదయంబు దానిఁజవిచూచినఁజూచునెముందువెన్కలున్

చొరవయు నేర్పుఁ గల్గునొకజూదరియెప్పుడుగెల్చుదానికన్
బరకితవుల్ సహింపకొకవంతుగనాఁడు మఱొక్కచో దురో
దర మని చెప్పిపుచ్చిరి, యతండును జూదపుఁగూర్మి వారిమ
చ్చరము గణింప కేగి తనసంచియుఁ బ్రాణము లిచ్చెవారికిన్

పానము నొక్కనాగరకపద్ధతిగాఁ దలపోసి నేఁటివి
ద్యానిధులందు గొందఱు దురాసవసేవల నర్థశక్తి వి
జ్ఞానము లోటుపోవుచు విషాదకరస్థితిఁ గాంచుచుండ న
జ్ఞానులు త్రాగుబోతులయి కష్టము లొందుచునున్కి చిత్రమే.

ఒడలు గుల్లయైన నుడుగును వెలయాలి
కోర్కె, యొడలు నిల్లు గుల్ల యైన
నుడుగ కుండుఁ గాదె చెడుగుత్రాగుడుకోర్కి
ద్యూతచౌర్యములకు నూఁత యగుచు. 151

సురయనఁ బ్రాణమిచ్చు నొకఁడంత నిజాంగన గూడఁ గూర్మిమై
వరయుచునుండు, నాతఁ డొకయప్పుడు త్రాగఁగ డబ్బులేక వం
దురి కరభూషణం బడిగి తొయ్యలిఁ, గొంకక తీర కాసతీ
శిరమును ద్రుంచి యాముదుగు చేకొనిపోయెడు పానశాలకున్

కోపముఁ బెంచు, నస్థిరతఁ గూర్చు, ధనంబు హరించుఁ, జిత్తసం
తాపమొనర్చు, సత్యకరుణాశుచితామలఁ ద్రుంచు, నమ్మికన్
బాపు, బలంబు కాంతి మతి నాశముచేయును, వేయునేల యే
పాపగుణంబులీ చెడుగుపానమునం గనరావొ చూడుఁడీ! 152

సారమతోన్నతం బమలసాంఘికజీవన మార్యధర్మవి
స్తార మశేషభూస్థలి నుదారగుణంబుల కాదిమంబు వి
ద్యారమణీయనాగరకతం గణుతింపఁ బురాతనంబు నా
భారతదేశ మిప్పు డతిపానరతిం జెడుచుండె నక్కటా! 135

న్యాయము చెప్పువారును సమర్థపదంబుల నుండువారు శా
స్త్రీయులుఁ గొందఱన్నిటను దీరినవారయి మద్యరూప పా
నీయము గ్రోలుచుండి రన, నీచపువెంగలిమూఁక కల్లుసా
రాయిని ద్రాగునంచు వనరందగునే! మధువాంఛ యెట్టిదో?

నాఁటికి నాఁడు మద్యము ననారత మానినఁ గాని దానిపై
గాటపుఁ గూర్మి తీరనియొకం డొకకాసు గడింపలేక యా
రాటముచెంది తాడులెగఁ బ్రాఁకుట నేరిచి యొక్కరేయి పె
త్రాటిని బ్రాకి లొట్టికలుఁ ద్రాగియు డిగ్గఁ గూలె విస్మృతిన్.

సారప్రవృత్తిగాదు సుఖసాధకమార్గము గాదు జీవనా
ధారముగాదు, గాని తనదారిని బూరిని మేసి కానలోఁ
జేరెడిలేడిఁ గూడ నడగించుచునుందురు గొంద ఱట్టి ని
ష్కారణహింసఁ జొచ్చు తమకంబునకుం జొరరానిదున్నదే? 156

ధారుణిఁ బొట్టపోసికొన వారు లనేకములున్నఁ గొందఱా
బారులు తీరి కన్నులకుఁ బండువుగా దివి నేగుశారికా
కీరకపోతవారముల నేలిమొయిౝ గుఱిపెట్టి కొట్టఁగాఁ
గారణమేమి? వేఁటతమకంబ, బలీ తమికడ్డమున్నదే? 157

ఘనమృగయుందు వేఁటతమకంబునఁగానకుఁబోయి మచ్చుమే
కను దినవచ్చు బెబ్బులిని గాంచి తుపాకినిగాల్చి కూల్చి వెం
టనె పరుగెత్తి వేడ్కఁ జరణంబున దానిమొగంబు తన్ని కా
లిని బులి నోటఁ బట్టి విడలింపఁగఁ జచ్చెను గొన్నినాళ్ళకున్.

పరుషవచనార్థదూషణపరుషదండ
నంబు లణఁగించుచుండె లోకంబు నిల్లె
యైహికాముష్మికసుఖంబు లడఁగఁద్రొక్కు
పరమశత్రువు వ్యసనసప్తకము గాదె? 159

—అధికారాదులు—ప్రేమ—

పిన్నలయం దవజ్ఞయును బెద్దయందు ననాదరంబు నా
పన్నులయందు నిర్దయత బందుగులం దవలేప మర్థసం
పన్నులయందు నీసును సమానులయందు నసూయ దీనులం
గన్న జుగుప్స నాఁగ నధికారమదప్రియతావికారముల్ 160

చులుకనచేసి యెల్లరను జూచు, భుజంబుల శంఖచక్రముల్
మొలచినయట్లు దూచుఁ బెడమోమిడి పల్లుచు మీఁదు చూచుఁ బె
ద్దలు తను మ్రొక్కఁ జూచుఁ, దనదర్శనమిచ్చుటె యర్థికోటికిం
గలిమి యటంచుఁ జూచు, నధికారబలప్రియుఁ డెట్టి మోహమో!

భూసురపాంథబంధుజనమున్ ధనమన్న మొసంగి తన్పుచున్
గాను గడింపకుండి తనకల్గినముప్పదిపుట్లభూమి గాఁ
జేసి యొకండు పుత్రులకుఁ జెప్పయుఁ గట్టయుఁ జేతికిచ్చి స
న్యాసులఁ జేసె నావితరణప్రియ తా మహిమంబు గంటిరే! 162

లోకమునందు కొంద ఆతిలుబ్ధులు పిల్లికి భిక్షవేయ ర
ర్థైకపరాయణత్వమున నార్జన చేయుచు విఙ్ఞవీఁగి సు
శ్లోకతఁ గోరి తా నుభయలోకసుఖం బొనగూర్చ రానియో
వో కొఱగాని కార్యముల కూరక దుర్వ్యయ మాచరింపరే!

తనగతి దా నెఱుంగక వదాన్యతకుం బరుగెత్తు ముందు వె
న్కను గనఁ డైన దాతనను గానిది కంచమునందు పెట్టు వం
చనము నిజంబుగాఁ గను, విచారణ చేయఁడు కార్యరీతి నే
ర్పొనర, ముఖస్తుతిప్రియత నుబ్బులరంగఁడు దుర్విదగ్ధుఁడై

ఇంతకు నంతచేర్చి వచియించుచు నన్నిటియందు నాత్మవృ
త్తాంతము దూర్చి వానికి నుదాహరణంబు ప్రమాణమంచుఁ దఁ
న్నెంతయుఁ దానె చాటుకొను నేమనుకొందురొ యన్న చింతయా
వంతయు లేక గొప్పకయి యాత్మనుతిప్రియుఁ డెట్టి వాగ్ధ్యమో!

## — రసములు ప్రేమ —

శృంగారము:—

హాస్యరతి శోకకోపభయాదు లైన
స్థాయిభావంబులకు నెల్ల సదనమైన
మానసంబుప్రవృత్తి ప్రేమమున నగుట
సకలరసములు ప్రేమమూలకము లయ్యె. 166

కోరికలూరుపల్కులను,గుల్కులుచిల్కెడి నవ్వుఁబువ్వులం దేరెడిమోవితావి తరితీపులముద్దుల, మేను మేనువోం గారెడికౌఁగిలింతల, సుఖానుభవం బను పేరఁ దీరుశృం గారము రాజధానిగ జగంబును బ్రేమమహీశుఁ డేలెడిన్.

పరిణయబంధబీజ మనుభావబలాంకుర ముత్సవక్రియా పరిచయమూల ముల్లసితభాషణపల్లవ మాద్యసంగమ స్థిరహృదయానుసంధిమయదివ్యసుమం బగుప్రేమకల్పవ ల్లరి సుఖవిస్తరామృతఫలప్రదమై యజరామరం బగున్.

కనులారం గని యౌవనాబ్జ మనురాగశ్రీనివాసంబు నె మ్మనముప్పొంగ,వచోఽమృతంబధరబింబంబానికూర్మిం జిగి ర్చినమైడీఁగను దాఁకి మే నలరఁగా శ్లేషాంతరాత్ముండు పా వన సంపూర్ణ సతీ సుఖామృత రసాస్వాదైకలోలుం డగున్.

స్మరబాధం బడలేక రాత్రిచరుఁడై సంకేతముం జేరుచోఁ బరు లీక్షించుదు రన్న సంశయభయభ్రాంతుల్ మనంబందుము

ప్పిరియై వేఁచిన మానలేక చని యల్పిష్ఠాంతరాత్ముండు దాఁ బరకీయాసుఖ మద్యపాన వివశప్రజ్ఞావిమూఢుం డగుఁ.

సరివారు చూచిరా పరియాచకము చేసి
చీ చీ యటంచు దూషింతు రేమొ
తమవారు చూచిరా తలయెత్తుకొని యింట
నల్లాడ మొగ మింకఁ జెల్ల దేమొ
మగనికిఁ దెలిసెనా మఱి లేదు తప్పక
ప్రాణాల మీఁదికే వచ్చు నేమొ
పెండ్లాము చూచెనా పెఱవారి కెఱిఁగించి
తిట్టి పోయుచు రచ్చఁ బెట్టునేమొ
యనెడి సందేహముల గుండె లదరుచున్న
జారిణీజారు లనురాగసారసుఖము
లనుభవింపరె? చూఁడుఁడీ యయ్యలార!
వలపు చెలరేఁగు చెడుగు నర్మిలివిధంబు 171

ఎవ రేమన్నను నిర్దయాత్ముఁ డయి మేలిల్లాలినేడ్పించుచో నవమానంబును దోషముం గనక, తన్నా వేశ్య కామింప రో యివి శేషం బని కాంచలేక మద భూయిష్ఠాంతరాత్ముండు వా రవధూటీ మృగతృష్ణికా సుఖజలభ్రాంతాక్షీణుం డగున్

మనసున కెక్కు రూపమును మంచికులంబును గల్గునొక్క స ద్వినయవివేకభూషణుని బెండిలియాడఁగఁ గోరునీమ వ

చ్చిన యొకకన్నె యాశలంపు చెల్లని బొంగకు వాడి వత్తయ
య్యెను జనకుండు వాని ధనహీనునిగాఁ గని తీసివేయుటన్

వీరము:—

కోరినయట్టి యర్థమునకుం బ్రతిబంధము గల్గినంతనే
పోరొనరించియుం, గరుణఁ బూని పదార్థము మేనొసంగియున్
గోరిక లిచ్చియుం బరులకున్, ఘను లిష్టము నిర్వహింతు ర
వ్వీరము ప్రేమరాజునకుఁ బెట్టనికోట సుమిత్రయాంబుజా.

జినమహాసింద్రమహేంద్రజిద్బలిశిబిశ్రీరామజీమూతవా
హనరాధేయదధీచు లాపరశురామాదుల్ దయాదానధం
డనవీరుల్ వినవచ్చుచుందురు పురాణగ్రంథ విఖ్యాతవ
ర్తనులై వారిగుణంబులందెనఁగుపూర్ణప్రేమ వీక్షింపుడీ!

ఆమహావీరులకు సాటియైనవార
లిపుడు లేరనఁగూడ దహింసయందు
నపరబుద్ధుండు నాఁగ మహాత్ముఁడైన
యట్టియొక్కండు వేవురపెట్టు గాఁడె? 176

ధన మఖిలం బొసంగినవదాన్యులు దేహములైనలెక్కచే
యనిపరకార్యదక్షులు దయామయు లెన్నివిపత్తులైన శాం
తిని భరియించుచుఁ మతము దేశము గాఁచెడివీరశేఖరుల్
ఘనులు మహాత్ములెందఱు జగంబున లేరది ప్రేమగాదొకో!

పంచాపగాభూమిపై దాడివచ్చిన
వీరులం దఱుమఁడే పృథ్వీరాజు?
ఓరుగంటిని గ్రమింగఁ గోరినపగతురఁ
ద్రోయఁడేమి ప్రతాపరుద్ర విభుఁడు?
కర్ణాటరాజ్యంబు గాంక్షించుబిరుదుల
రాయఁడే శ్రీకృష్ణరాయ విభుఁడు?
హిందూమతంబుపై యెత్తినవిమతులఁ
జెండాడఁడే శివాజీవిభుండు?
కంఠమునఁ బ్రాణ మున్నంతకాల మట్లె
పోరుసలుపుచు వారందు పొలియలేదె?
కంటిరే దేశమతములఁ గావఁ బూని
నట్టిప్రేమాతిరేకమహాత్త్వ మహహా! 178

దిక్కేమియును లేనిదీనుల ననదలఁ
గనికరంబునఁ బ్రోవఁ గడఁగువారు
బాటసారుల కన్నపానముల్ నిచ్చలు
పెట్టంగ సత్రముల్ పెట్టువారు
పరులకష్టంబులఁ బాల్గొని వానిఁ ద
ప్పించుచో నసుము బిగించువారు
సాధుసజ్జనబాధ సలుపుదుష్టుల నెది
రించి వారల నణఁగించువారు

దేశమతభక్తిబద్ధులై తిరుగువారు
గాఁగ బహువిధవీరు లేకాలమందుఁ
గలరు వారలసుగుణంబు లలమికొనిన
సాత్త్వికప్రేమమున కొండు సాటి యగునె? 179

హాస్యము:—

చిత్తరంజక చిత్రగోష్ఠివిచిత్ర
వాదకేళికలాదివినోదలగ్న
మైనయధికానురక్తిచే హాస మొదవుఁ
గాన హాస్యంబునకుఁ బ్రేమ కారణంబు. 180

కందుకకేళులఁ సరసగానములన్ రసహావభావ ని
ష్యందివిచిత్రపాత్రనటనాదుల హాస్యకథాప్రసక్తులన్
బొందులవారితోఁ గలసి భోగపరాయణులై నకొంద ఱా
నందము నొందు చెప్పుడును నవ్వుచునుందురు నిర్విచారులై

వత్సలము:—

మొలకలు వాఱుముద్దునగుమోములబిడ్డలమేనికౌఁగిలిం
పులఁ, బసలార బాలురకు బుద్ధులు దిద్దుచు నేర్పునట్టి వి
ద్యలఁ, గులహీనదీనజనదాసులఁ బాలనసేఁత, మీఱువ
త్సలమును బ్రేమ మొక్కటని సర్వజగద్విదితంబుగా దొకో!

వెలసినపాణినీయ మన విశ్రుతి కెక్కిన పండితుండు శి
ష్యులఁ దనకన్నబిడ్డలుగ నోమినమద్గురు చర్లబ్రహ్మశా

స్త్రీలు సతతాన్నదానపరితోషిత పాంథుఁడు పుణ్యమూర్తి వ
త్సలరసమూర్తి నా సుజనసన్నుతిఁ గాంచఁడె గౌతమీతటిన్

కర ముపొంగినవైనతేయినడిలంకం జిక్కి మాలందు
దుర్భరమౌనాఁకట నర్ధరాత్రిమున బొబ్బల్ వెట్ట,నే జేఁడిపోఁ
గరుణన్ భర్తను బంపె నన్న మిడి,డొక్కా సీతమాంబాధరా
మరసాధ్వీమణిదీనవత్సలత సామాన్యంబె కీర్తింపఁగన్? 184

బీభత్సము:—

తమకుఁ దమయందు గలకూర్మిఁ దలఁపఁదాఁక
వినఁగఁ దినఁగఁ గనుంగొన వెగటు దోఁచు
పట్టికొన్నిపదార్థంబులందు రోఁత
పడయుదురు గొంద ఆదియె బీభత్సరసము. 185

తనచెలికాఁడు వారవనితాగృహమేగుచుఁ దన్నుఁగూడ ర
మ్మని పిలువంగ నొక్కఁ డొడలంతయుఁగంపమునొందనిల్లుగు
ల్లను బొనరించునిట్టిపనుల న్నను దింపకు మెప్పు డీవు చీ
యని పెడమోము వెట్టి చను మంచును సైఁగరొయనర్చెఁ జేతితో

తనపరివారుమద్యమును(దావఁగఁబోవుచుఁదన్నుఁగూడఁదో
డ్కొనిచనియించుకంతచవిగొమ్మనియీయఁగఁబోవఁ జీ యిసీ!
యనుచును ముక్కుమూసుకొని యావలికేగి రొయికందు దీనివా
సన గొనఁజాల రోగపడఁజాల నటంచును జాఱె నింటికిన్ 187

అద్భుతము:—

అలవికానిపదార్థంబు లాకస్మికముగఁ
దలఁచికొని సంతసించుకొందఱకు నవియె
కలిగ నేనియు నాకస్మికంబు లగుచుఁ,
బొడమువిస్మయ మదియె యద్భుతరసంబు. 188

కడుఁబేద యగునొక్కవడుగు పెండిలియాడ
ధనము సంపాదింపఁ దరలిపోయి
పురము పల్లియ నాక తిరుగుచు నొకయూరి
కరణంబు నింటికి నరిగినంత
వృద్ధుండు నర్థసమృద్ధుండు మృతదార
పుత్రుఁ డేకాకి యాభూసురుండు
తనకుమారునియట్లు గనవచ్చు నా బాలు
నెమ్మిమైఁ దనయింట నిలిపి యంత
నన్నుఁ గనిపెట్టి యుందు నీ వున్న యెడలఁ
బెండ్లిచేసి యశేష మర్పింతు ననఁగ
సత్యమా యని యతఁడు విస్మయము నొందెఁ
దుదకు నట్టులె సర్వసంపదల నొందె. 189

శాదరీము:—

తాను బ్రేమించినట్టి పదార్థమునకుఁ
బరుని యాటంక మొదవినపట్టునందు

నాడలు తెలియనికోర్ధంబు పొడము నదియ
కాదగ్రిరస మయ్యె దానికారణము ప్రేమ. 190

(దీనికి లక్ష్యములు ,,దుష్టప్రేమ"లోఁ గలవు.)

భయానకము:—

మానధనప్రాణంబుల
హాని గలుగునన్న శంక నతిభీకరదు
ర్మానవమృగములఁ జూడం
గా నగుభయమే భయానకరసం బయ్యెన్. 191

కాన భయానకంబునకుఁ గారణ మెన్నఁగఁ బ్రేమవత్తాదు దు
ర్మానవుఁ జూచి యొంటిమెయి మానినిజంకుట, బాటసారియుం
గాననమెకంబుఁ జూచి వెఱగాంచుట, దొంగల నింటఁజూచి యే
మానవుఁ డైన బెగ్గిలుట, మానతనూధనకాంక్షఁ గాదొకో?

కరుణము:—

మరణము తప్ప దేరి కనుమాట నెఱింగియు దారపుత్రసో
దరగురుభర్తృబంధుసముదాయమునన్ మృతినందినట్టి యొ
క్కరి కొఱకేడ్చుచుండు రధికంబుగ శోకపయోధి మున్గియా
కరుణము ప్రేమభావరుఁడు కాఁపుర మున్నయగారవారాజువిా

ఇష్టవస్తువినాశన మిష్టబంధు
విప్రయోగంబు కాయికవిషమదశలు

నాత్మసుఖభంగహేతువు లగుటఁ జేసి
నరులు విలపింతు రదియును గరుణ మగును. 194

ప్రేమ మేవస్తువుల నావరించియుండు
వానికలిమి సుఖంబును వానిలేమి
దుఃఖమును లోకు లనుభవింతురు నిజంబు
గాన సుఖదుఃఖముల కధికారి యదియె. 195

ఆత్మసంబంధ మినుమంత యైన లేని
యొరులదుఃఖంబు గని దుఃఖ మొందు నొకఁడు
దానఁ బ్రేమంబు లే దని తలఁపరాదు
కుంభకారుండు చేయనికుండ యున్నె? 196

పరిశీలింపఁగ శాంతే
తరరసములు వేఱుగతులఁ దనరుచుఁ దుదకున్
గరుణంబుగఁ బరిణామముఁ
బొరయుట నైజంబు ప్రేమ పోవనికతనన్. 197

జనసామాన్యము సర్వదా సుఖముగాంచంగోరి పర్యాయ
తినిగాంచున్ సుఖదుఃఖముల్ మనసుశాంతింబొందఁగారామి,
ర్చినవాఁడో కరుణంబున న్మనిఁగి యా ప్రేమంబు సౌఖ్యంబువ
కను బోనివ్వక త్రిప్పి శాంతరసభోగం బానఁగాఁ జేసెడిన్. 19

హరిహరభక్తిశాంతరస మానుతవస్వులలోనఁ గూడ నీ
కరుణారసంబు గ్రోలక యొకండును మున్నె విరక్తి నాపరా

త్పరుఁ గనఁగోరియుండఁడనవచ్చు, నిజంబుగవాఁడుసౌఖ్యమున్
మఱఁగియు దానిహానిఁ గరుణంబునుగ్రోలియుశాంతమూనుటన్

వారు వీ రసనేల యా వ్యాసబుద్ధ
శంకరాదులు గూడ వాత్సల్యగరిమ
జ్ఞానబోధకు లగుటకుఁ గారణంబు
పరులదుఃఖంబు గని దుఃఖపడుటగాదె! 200

తుదకు మోహానురాగ హేతుకము లైన
యన్నిరసములు కరుణంబునందు నణఁగుఁ
గరుణమో నిత్యవైరాగ్యకారణ మగు
శాంత ముదయింపఁ జేసి తా సమసిపోవు. 201

కామక్రోధాద్యనుగత
తామసరాజసగుణప్రధానం బగు నీ
ప్రేమఁ గని సాత్త్వికాది
ప్రేమంబులమార్గములు నిరీక్షింపుఁ డిఁకన్. 202

ఓన్నమః పరబ్రహ్మణే.

# ప్రేమతత్త్వము.

## ఉత్తరభాగము.

---

### — సాత్త్వికప్రేమ —

ఆమహనీయలక్షణము నాగణనీయ ఋజుప్రవర్తనం
బామననీయశాంతరస మామృదుభావజితారిలోక మా
కామ వికారశూన్య మనఘం బనపాయము నైనసాత్త్విక
ప్రేమము చిత్సుఖంబు గనిపించు నుపాయము నా నతింగనున్.

పూర్వజన్మకర్మమును స్వభావం బండ్రు
దానఁ బుట్టు రజము తమము సత్త్వ
మనఁగ మూఁడుగుణము లందు సత్త్వము సుఖో
పాయ మగుచు జ్ఞానదాయి యగును ౨

శమము దమ మోర్పు దయయు శౌచంబు తపము
దానమును భక్తి యాస్తిక్యధర్మనిష్ఠ
లార్జవజ్ఞాన సత్యంబు లాది యైన
యమలగుణములు సత్త్వచిహ్నంబు లగును. ౩

మఱియు సత్త్వంబు శుద్ధము మలిన మనఁగ
నిరుదెఱంగులు, రాజసమించుకైన
లేనియది శుద్ధసత్త్వము దానిసోఁకు
తగిలినట్టిది మలినసత్త్వంబు నగును. 4

కామ మొక్కటె యారజఃకార్య మనుచు
నెఱుఁగఁ దగు నిందు, నదియు నైహికము గాదు
పారలౌకిక మగు, దీనిఁ జేరి సత్త్వ
మయ్యె మలినంబు చేరక యమల మయ్యె. 5

జపతపంబులు నీశ్వరార్చనలు సలిపి
యాగము లొనర్చి స్వర్గసుఖాదు లొందఁ
గాంచుటయె పారలౌకిక కామ మగును
దాన సత్త్వంబు మలినమై తనరు నందుఁ. 6

కావున సకామనిష్కామగతులఁ బరగు
సాత్త్వికప్రేమ కిట్లు లక్షణ మెఱింగి
వినఁదగు సకామసాత్త్వికప్రేమమునకు
ముందు లక్ష్యంబు లనుభవపూర్వకముగ. 7

## — సకామ సాత్త్విక ప్రేమ —

పరసుఖ మాత్మఁ గోరియొకభక్తుఁడుకొండొకయిష్టదేవతా
సురుచిరవిగ్రహంబుగల చోటులకుం జని శక్తివంచనం

పొరయక చిత్తశుద్ధిమెయిఁ బూజ లొనర్చి తదేకనిష్ఠమై
హరిహరశక్తి భక్తిమయుఁడై కడపుం దనయాయు వెంతయున్.

లోకసుఖంబులందు గలలోలుపతం దిగఁద్రావి లోభమో
హాకులమానసంబు నిగమాగమవాదములందు ద్రిప్పి పు
ణ్యాకరులైన పెద్దలదయం దనజన్మము సార్థకంబుగా
నాకసుఖంబుఁగోరి సవనంబు లొనర్చు నొకండు ప్రాజ్ఞుఁడై. 9

ఎడయక భావిజన్మమున నింతకుఁ గోటిగుణంబు లర్థముల్
పాడము నపూర్వమహాఫలము పుట్టునటంచును ధర్మబుద్ధిఁ బ్రా
ణువులలోని సారము గనుంగొని బీదలు సాదు లెవ్వరే
నడిగినవారికెల్ల నొకఁ డన్నము పెట్టును జిత్తశుద్ధిమై. 10

భోగములెల్లఁ బాసి మునిపుంగవసేవ లొనర్చి సత్తపో
యోగము నభ్యసించుఁ బవనోదకపర్ణఫలాశియై వనీ
భాగమునం దొకండు భవబంధము వెండియుఁ గల్గకుండ స్వ
ర్భోగము నిచ్చలిచ్చెడి యపూర్వపుఁ బుణ్యము నేకరింపఁగన్.

తా నొనరించినట్టిపని ధారుణి నెంతకు నుండు నంతకుం
దా నివసింపవచ్చును సుధర్మ నటన్నమనీష దేవళం
బేనియు సత్రమేని చెఱు వేనియు లోకహితంబుపొంచె ని
ర్మాణ మొనర్చు నొక్కజనమాన్యుఁడు నిర్మలమానసంబునన్.

అన్నిటికంటెసూనృతములాడినపున్నెముమిన్నయెన్నియో
[illegible]న్నము లాచరింప నగు సత్ఫల మీవ్రతమిచ్చుచున్నవి

ద్వన్నుతి విన్నవాఁ డొకఁడు దానమదింగదియించి యెన్నియే
బన్నము లడ్డగించినను బల్కఁ డసత్యము ధీరచిత్తుఁడై. 13

కలుషము లెల్ల పాయు నణఁగారు విచారము సత్ప్రవర్తనం
బలవడుఁ బుణ్యలోక మనయంబు లభించు నటన్న ధర్మసూ
క్తులు విని తత్ఫలంబు నెడఁ గూరిమి నొక్కఁడు సర్వతీర్థయా
త్రలు పొనరించుచుండును శరీరసుఖంబు దలంప కెల్లెడన్. 14

అట్టిదృష్టాంతములయందు నెఱుఁగ నగును
పారలౌకిక సుఖవాంఛ భవ్యరీతి
వెలయఁగ, సకామసాత్త్వికప్రేమ యనెడి
యిదియు నాత్మార్థ మనుమాట విదిత మయ్యె. 15

కామము పారలౌకికసుఖంబున నుంట సకామసాత్త్విక
ప్రేమ మనంగ నిట్టిది గరిష్ఠ మనింద్యము నయ్యె, నింక నీ
కామము నైహికం బగుసుఖంబున నిల్చినధూర్తసాత్త్విక
ప్రేమవిడంబనంబు నరవిం గనుఁ డిందలితత్త్వ మారయన్. 16

—◆ సాత్త్వికప్రేమాభాసము ◆—

నిరుపమకర్మనిష్ఠుఁ డన నేర్చిన యాచనచేసి యెల్లరన్
దొరకినయంతవట్టు తెగదోఁచి ధనంబు గడించి జన్నమున్
జరుపుచు, వచ్చుచూపఱకు సాత్త్వికమూర్తిగ, దోఁచివారునం
బరమున నిచ్చు* చందరిమనిస్పైఁ గనువెట్టెడియట్టఁ గానమే?

* ఇది కానుక యనెడి యర్థమునుదెల్పు వైదికపరిభాషాపదము. పాఠాంతరము—కానుకలపై—

తా నొకకర్మనిష్ఠుఁడు సధర్ముఁడు నా నటియించి పౌరస
మ్మానముఁ బొందు నొక్క యభిమాని పదంపడి సోమయాజినై
వీనులఁ గుండలంబు లొగి వ్రేలఁగ శాలువ గప్పి యూళులన్
జానపదోపదేశకుఁడు నాఁ గనవచ్చుచు సంచరింపఁడే? 1

చదివెనుగాక వేదమును శ్రౌతముఁ, జేసెనుగాక యజ్ఞముల్
బదపడి సల్పెఁ గాక చయనంబును దా, నతిధర్మకర్మకో
విదుఁడ నటంచు గర్వమున వీఁగెడు నాతని కర్మనిష్ఠలో
వెదకినఁ దోఁచునొక్కొ? యొకవీసము సాత్త్వికభావమేనియున్

మీరలు రండు దీక్షితులు మీరలు రండిట సోమయాజులఁ
చేరికి లేచి గౌరవము నెప్పుడు పొందెదమంచుఁ గొంద ఱా
హూరఁ జరించి కూర్చి ధన ముద్ధతిఁ జేసినవట్టి జన్నముల్
వారక మేఁక కిచ్చినను వారల కిచ్చునె స్వర్గసౌఖ్యముల్. 20

ఏలొకొ వేయిమాట లిపుడిట్టు లొనర్చెడు పెక్కుమందిలో
శీలము సత్త్వభావ మరచిన్నము వాసియుఁ గానవచ్చునే?
శాలలలోని యగ్నులను శాలల నార్చుచు సర్ధమగ్రతాం
బూలము గోరి చేయు క్రతువుల్ సురలోకసుఖంబు లిచ్చునే?

తోలు కుశాసనంబు మడిదోవతు లొక్క విభూతిపంకజా
రీ లలితాక్షమాల సవరించుచు వేకువ నేట మున్గి త
త్కూలమునందు కన్నుగవతోఁ జెదవుల్ గదలన్ జపించుదం
భాలతపస్వులందు గనవచ్చునె సాత్త్వికశక్తి యింతయేన్. 22

పండ్రెండు తిరుమణి పట్టె నామంబులు
విష్ణుపాదములతో వెలయ దిద్ది
పట్టంచు నీర్కావి పుట్టంబులం గట్టి
తులసిపూసల సరంబులను దాల్చి
పట్టెలు తప్పించి పసుపారు కలపంబు
బొజ్జమీఁదను బుజంబులను బూసి
దివ్యస్థలంబుల దినదినంబును నంబు
లర్పించు* కట్టడు లారగించి
స్వామి కైంకర్య మొనరింప వచ్చి పోవు
భక్తులును భక్తురాండ్రు ప్రపత్తి చేసి
వినఁగ దివ్యప్రబంధముల్ వినుచు దంభ
భాగవతులందు సాత్త్వికభక్తి కలదె? 23

అంజనంబును గేరునంగార రేఖలు
ఫాలభాగాదులఁ గీలుకొల్పి
తనువెల్ల ధవళచందనముద్ర లంటించి
తులసి పత్రములు వీనుల ఘటించి
దివ్యసాలగ్రామ తీర్థపాత్రంబుతో
నాంజనేయ మఠంబు నధిగమించి

---

* భక్తులకు నియతములైన యన్నప్రసాదములు. తమిళములో కట్టళైయందురు

జపహోమహార మంచు భక్తురాండ్రకు మహా
త్త్వంబు బోధించి తీర్థం బొసంగి
మానవదేవరసంస్తవ మాచరించి
మధ్వమతధర్మతంత్రమర్మములు దెలిపి
పిదప రామాయణార్థంబు విఱిచి చెప్పు
దాంభికాచార్యుభక్తి సత్త్వంబు గలదె? 24

శివుఁడు సాక్షాత్కరించెనాఁ జెలఁగి శిష్య
సంతతికిఁ బూర్ణదీక్ష లొసంగి బ్రతుకు
సతతసంచారి యగువీర శైవగురుని
యెడఁద సాత్త్విక మగు భక్తి యింత యున్నె? 25

శక్తి ప్రత్యక్షమై యభీష్టంబు లిచ్చు
ననుచు జపహోమతర్పణార్చనల మునుఁగు
కుంకుమాభీలముఖుఁడు శాక్తునిమనంబు
సాత్త్వికం బైనభక్తిలేశంబు గనునె 26

కనఁబడఁదు కాంచు, వినరాదు వినును, మాయ
నణఁగి యున్నది, బ్రహ్మమే యఖిల మనుచుఁ
బామరులఁ జేర్చి తత్త్వం బువన్యసించు
కపటవేదాంతి సత్త్వమార్గంబు గనునె? 27

వారును వీరు నేల? యిహవాంఛలయందు విరక్తిఁజూపినం
బారముఁ బాసి పిల్లసిగ జందెములం దెగఁదీసి కమ్మగా

గారెలుబూరెలుం దినుచుఁ గాసును వీసముఁ గొంచు దేశసంచారము చేయు భిక్షులదెసంగనుఁ డెందఱు సత్త్వమూర్తులో.

ఇట్టిదృష్టాంతములయందు నెఱుఁగవచ్చు
నైహికసుఖేచ్ఛ సాత్త్వికమైనరూపు
వెలయు, నాభాససాత్త్వికప్రేమ యనెడి
యిదియు నాత్మార్థ మని చెప్ప నేల మఱియు. 29

కనుఁగొంటి మిరు తెఱంగులఁ
గనవచ్చు సకామసాత్త్వికప్రేమ మిఁకన్
వినఁదగు నిశ్చలమతితోఁ
గనఁదగు నిష్కామసాత్త్విక ప్రేమగతిన్. 30

## నిష్కామ సాత్త్విక ప్రేమ

ఐహికాముష్మికసుఖంబు లాసపడని
కతన సత్త్వమయంబయి క్రాలుకతన
నాత్మవిజ్ఞానకారణమైనకతనఁ
బ్రేమ నిష్కామసాత్త్వికప్రేమ మయ్యె. 31

ఇదియే కావలసినయది
యిదియే దుర్లభము కాని యిదియే జ్ఞేయం
బిదియే మనసున నిలిచిన
సదసత్తులమార్గ మెల్ల చక్కఁగఁ దెలియన్. 32

అన్ని మతములవారికి నందునందు
భేదభావంబు లేకపోలేదు గాని
విమల నిష్కామసాత్త్విక ప్రేమమందు
భేదమతి యెవ్వరికిఁ గూడ లేదు లేదు. 33

మమకార మహంకారము
దమియించి సమస్తభూతదయతో సమభా
వము గల్గి యహింసావ్రత
మమలినమతి సల్పువారియం దిది నిలుచున్. 34

వైరులు దమ్ముఁ దిట్టి పలు బాములఁ బెట్టినఁ దాము వారిపైఁ
గూరిమిఁ జూపి వారొరులకుం గలిగించెడి బాధకుం బ్రతీ
కార మొనర్చుచుండి యుపకార మహింసయుఁ దాల్చినట్టి యా
కారము శ్రీమహాత్ములముఖంబున నియ్యది తాండవించెడిన్

చేసినచేత వమ్మయినఁ జింతిలకయ్యది సిద్ధిఁ గన్న సం
తోసము చెంద కాత్మసుఖదుఃఖవిచార మొకింత లేక యే
యాసయు లేక జన్మము పరార్థముగాఁ దలపోసి యెల్లెడం
గాసిలు నమ్మహాత్ములముఖంబున నియ్యది నాట్యమాడెడిన్

పరుఁ డొనరించు తప్పు తమపై విడికొంచును దానఁ గష్టము
లొప్పరసినవారి దుఃఖమును ముందుగఁ దాము వహించి వారికి
ర్వ్వరకు హితోపదేశమునఁ బొం దొనరించు మహానుభావతా
కరు లగు నమ్మహాత్ములముఖంబున నియ్యది గాననయ్యెడిన్.

శమము దమంబుగన్నఁగవఁజక్కఁగనెక్కొనియుండదానస
త్యములును జేత వాత నొగిఁ దాండవమాడ, నహింస బుద్ధినై
క్యముఁగన, సర్వభూతకరుణాకరమై హృదయం బెలర్ప, స
త్త్వము మెయి దాల్చినట్టిసమదర్శియిలయందిదిగాన నయ్యెడిన్

పరమతధర్మసహిష్ణుత
పరహితచింతనయు స్వార్థపరివర్జనముం
గరుణాపరత యహింసా
పరమార్థజ్ఞతయు దీని భవ్యగుణంబుల్. 39

గౌతమబుద్ధదేవుఁ డనఘుండగుసర్వసమత్వభావనన్
భూతదయాపరత్వమున భూపరిపాలన వీతరాగుఁడై
నూతన తత్త్వమార్గము గనుంగొని ఘాతుకవృత్తిఁ జేసి దు
ర్నీతిఁ జరించులోకము తరింప నహింసను బోధచేయఁడే! 40

స్థిరమతి సత్త్వమూర్తి యగుజీసుక్రీస్తుమహానుభావుఁడీ
శ్వరుమతదూతనాఁగ దనబాటకుఁ ద్రిప్పుచు భక్తకోటి ము
ష్కరులకుఁ జిక్కి వారు తనకాయము కీలునుగీలు మేకులం
బరపుచునున్న నోర్చికొని వారిని గూరిమితోడఁ జూడఁడే! 41

ముందును వెన్కయుం దెలియఁబోలక రోగజలాధిలగ్నమై
కుందుచునుండులోకమునకుం బరమౌషధ మీయఁగోరి భూ
మిం దనువెత్తుసత్త్వమున మించుజగద్గురుమూర్తి సచ్చిదా
నందసుధారసంబు భువనంబునఁ జల్లుచు సంచరింపఁడే? 42

బహుమతసారముల్ గలిపి బ్రాహ్మమతంబొనగూర్చు నమ్మహా
మహుఁడగు రామమోహనుఁడు మానవతీతతి నొంచు ఘోరదు
స్సహమతబంధముల్ తలఁగ శత్రువులడ్డుచునున్నఁ బూన్కి మై
సహగమనంబు మాన్పఁ డొకో సాంఘికసోదరభావపూర్ణుఁడై.

భూతదయయు నహింసయు మోక్షకార
ణంబు లనుచు హితోపదేశం బొనర్చు
నమ్మహావీరముని వీరుఁ డాదియైన
యార్హతుల సాత్త్వికప్రేమ మరుదుగాదె. 4

వెలయు నిష్కామసాత్త్విక ప్రేమమునకు
నిట్టిదృష్టాంతరములు గల వెన్నియేని
పులిని మేఁకను నొక్కచోఁ గలిపి నీరు
ద్రాగఁ జేయు మహత్త్వంబు తనరె నిందు. 4

ఇది వైరాగ్యం బొనరుచు
నిది భక్తిజ్ఞానమార్గ మేర్పడఁ జూపున్,
ఇది జీవేశ్వర తత్త్వము
విదితంబుగఁ జేయు దీనివిధు లే మందున్? 4

ఎంద ఱెన్నిమతంబుల నేర్పరించి
జననమరణప్రవాహ సంసార జలధి
దాఁటిపోయిరో! వారికందఱికిఁ గూడ
నరయ నీప్రేమమే నావ యయ్యె నిజము. 4

దీని విడిచి యింకఁ దెలియంగ వివరింతు
మతములందు సత్త్వమహిత మగుచుఁ
బ్రేమ మెట్లు వెల్లివిరిసి లోకంబున
నల్లుకొనెనొ మున్ను తెల్లముగను. 48

కనుఁగొన నీశ్వరుఁడే లేఁ
డను నాస్తికమతములందు నాత్మప్రేమం
బొనరుట ముందుగ దానిని
వినిపింతు మతంబుకూర్మివిషయం బగుటన్. 49

### — నాస్తిక మతములు—ఆత్మప్రేమ —

చార్వాకమతము:—

అసువులం గూడు దేహమే యాత్మ, కాని
యరయ దేహంబుకంటె వే ఆత్మలేదు,
అంగనాలింగనాది జన్యంబు సుఖము
పరమపురుషార్థ మిది బృహస్పతిమతంబు. 50

స్వర్గ మనునది లే దపవర్గ మనుట
కల్ల, వేదంబు శాస్త్రంబు కల్పితంబు
కర్మకాండంబు ఫలదాయకంబు గాదు
పారలౌకిక మాత్మ నా భ్రాంతి వలదు. 51

పరులకష్టంబు తొలఁగింపవలయుఁ గాని
జీవహింస యొకప్పుడుఁ జేయరాదు.

త్రోసుకొని వచ్చుదుఃఖంబు తొలఁచివైచి
సౌఖ్య మొందుట యొక్కటే జన్మఫలము. 52

చావు తప్పించుకొనుట యశక్య మగుచు
మంటఁ గలిసిన దేహంబు మరల రాదు
తగినసౌఖ్యంబు గనుటయే తనువుఫలము
గాన సుఖజీవనము చేయఁ గడఁగవలయు.

అరయక యంగనాదివిషయంబులు దుఃఖముతోడి వంచుని
ర్భరసుఖసంగమంబుఁ విరక్తిని జెందుట మూర్ఖమార్గ మే
వెరవిఁడి యైన భోజ్యమగుబియ్యము గల్గినధాన్యరాసులం
బొరపడి యూఁకయుం దవుడు పొల్లును గూడెనటంచువీడునే?

కానఁ బురుషార్థ మనఁగ సుఖానుభవమె
యప్పు చేసియు నైన నాజ్యంబు ద్రాగి
బ్రతికి నన్నాళ్లు సుఖముగా బ్రదుకవలయు
ననుట దేహాత్మవాదులయభిమతంబు. 55

బౌద్ధమతము:—

కలఁడు లేఁ డనువాద మగ్రాహ్య మనుచు
నీశ్వరాస్తిత్వమును నిర్ణయింప కునికి
వేదములఁ గర్మముల గౌరవింప కునికి
బరఁగె నాస్తిక మను పేర బౌద్ధమతము. 56

అఖిలవిజ్ఞాని భగవానుఁ డనుచుఁదొల్లి
యన్యమతకర్తలకుఁ బూజ్యుఁ డైనవిశ్వ
మాన్యగౌతమబుద్ధుని మతమునందు
గానఁబడు సాత్త్వికప్రేమ కలుగ దెందు. 57

కర్మ మొనరింపఁగూడదు కర్మఫలము
ననుభవింపఁ బునర్జన్మ మందవలయు
దుఃఖసంసారమం దాశ తొలఁగవలయు
నాత్మవిజ్ఞానమున మోక్ష మందవలయు. 58

సర్వము దుఃఖము దుఃఖము
సర్వము క్షణికంబు క్షణికసత్తాకంబున్
సర్వము నిజలక్షణమగు
సర్వము శూన్యం బటంచుఁ జర్చింపఁదగున్. 59

వీనిని భావన లందుచు
వీనివలనఁ గలుగునట్టి విజ్ఞానమునన్
మానవుఁడు తత్త్వవిదుఁడై
మానిత మగునట్టి ముక్తిమార్గము గాంచున్. 60

జ్ఞానేంద్రియ కర్మేంద్రియ
మానసబుద్ధులను వెనుక మరలించుచు వి
జ్ఞానంబున రాగాది
జ్ఞానం బణఁగింప ముక్తిసంగతి గలుగున్. 61

పరహితవర్తనంబు మృదుపావనభాషణముఁ విరాగసం
చరణ మహింస సర్వసమసమ్మతి భూతదయోపకారముల్
నరున కవశ్యకార్యము లనందగు, వీనినిబట్టి ముక్తికిన్
దెరు వగుతత్త్వబోధము జనించు నటంచును గౌతముండనెఁ.

ఆర్హతమతము:—

హితమతిలోకతత్త్వముగ్రహించియథార్థముగాఁగభక్తిసం
తతి కెఱిఁగించునర్హదభిధానుఁడె యీశ్వరుఁ డంచుఁ దెల్పి గ
ర్హితమతి వేదముల్ పరిహాసించుట నాస్తిక సంజ్ఞఁ జెందె నా
ర్హతమత మిందు ప్రేమము దయామయమైయిలసిల్లువంద్యమై.

సమ్యక్చారిత్రంబును
సమ్యగ్దర్శనము నిత్యసత్యాకృతియా
సమ్యగ్జ్ఞానం బనునివి
సమ్యగ్గతిమోక్షమునకు సాధనము లగున్. 63

చిన్న మొక్కనుగూడ హింసింపరాదు
హాస్యమున నైన దబ్బఱలాడరాదు
తనకు నివ్వనిపం డైనఁ దాఁకరాదు
తనకు నిచ్చిన మిగులఁ గైకొనఁగరాదు

బ్రహ్మచర్యంబు నాచరింపంగవలయు
ననెడి యైదువ్రతంబుల నాశ్రయించి

యుక్తమంబగు చారిత్ర మొప్ప మఱియు
సర్వదీశ్వరుఁ డరసినయట్టి జీవ
తత్త్వ మఖిలంబు గాంచుట దర్శనంబు
జినమునీంద్రుఁ డెఱింగిన జీవతత్త్వ
సత్యమఖిలం బెఱుంగుట జ్ఞాన మగును
మోక్ష మొందఁగ మార్గ మీమూఁడు గలిసి,
యేది లేకున్న నిర్వాణ మెనయ రాదు.
సకలవస్తువిరక్తియు సర్వజంతు
కరుణ యాత్మవివేకంబుఁ గలుగఁజేయు
ననుచు బోధించుఁ బ్రేమ నార్హతమతంబు 68

పరులకు మే లొనరించుచుఁ
బరమానందంబు గనుట, బరమార్థంబున్
బరికించుచు నిర్వాణం
బరయఁగఁ గోరుటను, బ్రేమ మాత్మార్థ మగున్. 69

నిరీశ్వరసాంఖ్యము :—

అరయఁ బ్రధానమెల్లవియదాదివికారము లొంది యీచరా
చరజగ మయ్యె నియ్యదియె సాజ మటంచును దెల్పు తన్నిరీ
శ్వరమతసాంఖ్యమున్ బ్రకృతిఁ బాసి సుఖంపడఁగోరి తెల్విమై
బురుషుఁడు కేవలత్వమును బొందు నటం చతురక్తిఁ జూపదే

దీని నిట్లుంచి యింకమీఁదఁ దెలియఁబఱతు
సద్వయప్రేమవైచిత్రి, సగుణ మగుచు
ద్వైత మను పేరఁ బరఁగుమతంబునందు
తనరు నియ్యాది వివిధభేదములతోడ 70

## సద్వయప్రేమ.

జీవేశ్వర భేదంబును
భావించెడిమతము లెల్ల ద్వైతంబు లగున్
జీవుఁడు తనుఁ దా నీశ్వరు
భావించుటఁ జేసి యిదియు ద్వైతం బయ్యెన్. 71

♦ రామానుజమతము:—

భోగ్య మైనట్టిదృశ్యంబు భోక్త యైన
జీవుఁడును దన్నియంతయై చెలఁగుసకల
జగదుపాదానభూతుఁ డీశ్వరుఁడు ననుచు
నిందు మూఁడు పదార్థంబు లేర్పరించి. 72

నేరిమితోడ నిత్యము ననిత్యమెఱింగి విరాగి యౌచు సం
సారము రోసి జీవి మనసార విముక్తిని గోరి దేవుపిం
జేరి యుపాసనంబున భజించుచు జ్ఞానము నొందెనేని యా
కారుణికోత్తముండు దయ గల్గి స్వధామముఁ జేర్చు నాతనిన్.

---

♦ ఇదియే శ్రీవైష్ణవ మనియు, విశిష్టాద్వైత మనియుఁ జెప్పఁబడును.

దేవగృహమార్జనంబును దివ్యగంధ
పుష్పసంపాదనము దేవపూజ దేవ
తాస్తవము దేవతానుసంధాన మనఁగఁ
బంచవిధముగఁ బరఁగు నుపాసనంబు. 74

దాన జనియించు విజ్ఞానధార, దాన
నగు నిదిధ్యాసనాత్మక మైనభక్తి
కలరి వారి సుప్రసన్నుఁడై యాత్మభక్తు
నావరించునవిద్యను బోవఁద్రోచి. 75

మహితమై పునరావృత్తిరహిత మైన
యాత్మపద మిచ్చు నదె ముక్తి యనఁగఁబరఁగు
నట్టిముక్తున కావారి కట్లు కలుగు
నుత్తమగుణాళి కర్తృత్వ మొకటి దక్క. 76

ననుచు రామానుజుఁడు దెల్పె, నరయ నిందు
జీవుఁ డీశ్వరుసన్నిధిఁ జెందఁ గోరి
తనవిముక్తిని బ్రేమించి దానికొఱకు
నతనిఁ బ్రేమింప సద్వయ మయ్యెఁబ్రేమ. 77

పరమకారుణికోత్తమా! పరమపురుష!
భక్తవత్సల! యని పరబ్రహ్మము నెదఁ
గొలిచి యాదేవుధామంబు కోరుకతన
సద్వయప్రేమఁ జూపు వైష్ణవమతంబు. 78

* పూర్ణప్రజ్ఞమతము:—

సత్యము జీవుం డాత్మయు
సత్యం బీశ్వరుఁడు సకలసద్గుణుఁ డతఁడౌ
సత్యము వీరికి భేదము
సత్యము భేదంబు జీవజడముల కరయన్. 79

జీవుఁ డస్వాతంత్ర్యభావుండు విష్ణువు
సుస్వతంత్రుఁ డతనిసుగుణములను
బొగడి యతనికరుణఁ బొందినజీవుండు
హరిసమీప మేఁగు నదియె ముక్తి. 80

హరిసేవ ముఖ్య మయ్యది
పరమాంకననామకరణ భజనాత్మకమై
వెరవున జ్ఞానము వొడమును
నరునకు నది మోక్షసాధనం బగుఁ దెలియన్.

దుఃఖసంసారమునుండి తొలఁగి పోయి
శాశ్వతం బగునీశ్వరాశ్రయము గనుట
మోక్ష, మయ్యది నిత్య, మాముక్తి నిచ్చు
నతడె, కావున సేవ చేయంగవలయు. 82

---

* ఇతఁడే మధ్వమందిరుఁ డనియు, వాయుదేవునితృతీయావతార మనియు, ఆనందతీర్థుఁ డనియు, మధ్వుఁ డనియుఁ బిలువఁబడును. ఈమతమునకు మాధ్వమత మనియు, వైష్ణవమత మనియుఁ బేళ్ళు గలవు.

కరముల శంఖచక్రములకాల్చినముద్రలు దాల్చి పుత్రులన్
నరహరిపేళ్ళతోఁ బిలిచి నాల్క హితప్రియసత్యమంత్రముల్
కరముల దానరక్షణసుకర్మము లాత్మ దయాభిలాషనం
స్మరణము లంతయున్ హరిసమర్పణబుద్ధి భజింపఁగావలెన్.

అని చెప్పినపూర్ణప్ర
జ్ఞవిశుద్ధద్వైతమతము సుస్పష్టముగాఁ
గనఁ జేయును జీవునకుం
దనయం దీశ్వరునియందుఁ దగిలినప్రేమన్. 84

శైవమతము—

పతి పశు పాశము లని యీ
మతము పదార్థత్రయంబు మైకొను నందున్
బతి శివుఁడు పశువు జీవుఁడు
వితత మచేతనము పాశవిషయం బరయన్. 85

జీవుఁ డస్వతంత్ర భావుండు శివుఁడును
సుస్వతంత్రుఁ డతని శుద్ధతత్త్వ
మరసి వేత్త యైనయట్టి జీవుఁడు ముక్తిఁ
బొంది శివుని లోకమునకుఁ బోవు. 86

తలఁపఁగ దీక్ష ముక్తికిఁ బ్రధానము జీవశివాగమాదివి
ద్యలఁ బఠియించియీశ్వరమహత్త్వమెఱుంగుట నిత్యపూజలన్

పలుకుట చేతలందుగలసత్యమెఱుఁగుట పూర్ణభక్తి ని
శ్చలమతిఁజిత్తమీశ్వరునిసంగతిఁగూర్చుట దీక్షకార్యముల్. 87

నరుఁ డనపాయదీక్షల మనంబు శివైక్యము చేసియర్చనా
పరుఁడయి తన్మయత్వమున భక్తియు భావన సల్పి యమ్మహే
శ్వరునిజరూపముం దెలిసి శాశ్వతముక్తిని బొంది తా
మహేశ్వరుఁడగుఁగానియీశ్వరునిసన్నిధినుండెడుఁ స్వతంత్రుఁడై

కాని పరమేశ్వరుఁడు ముక్తులైన యామ
హేశ్వరులలో సమర్థులహీనపుణ్యు
లైనకొందఱి కిచ్చు లోకాధిపత్య
మనెడి కల్పంబు గూడ నిం పరయవచ్చు. 89

* పాశుపతమును శైవంబు ప్రత్యభిజ్ఞ
యును రసేశ్వర మహాలుక్య మనుమతంబు
లన్నియును ముక్తిమార్గంబు లందు వేఱు
లయ్యు జీవేశ్వర విభేద మను మతించు. 90

వైదికకర్మవర్జనము, స్ఫాటికపార్థివ శైలసూత లిం
గాదర పూర్వకార్చ, భసితాంగవిలేపనలింగాధారణా

---

* ఈ మతకర్తలలో నకులీశుఁడు, బృహస్పతి, మృగేంద్రుఁడు, సోమానంద నాథుఁడు, గోవిందభగవత్పాదాచార్యుఁడు, ఔలుక్యుఁడు, మున్నగువారు ప్రధానులు.

త్రాదికథాకరణాదులు, శివాగమతత్త్వవివేకపూర్ణ దీ
త్రాదు లొనర్చి జీవి పడయంగలఁడాశివరూపమోక్షమున్. 91

అనుచుఁ దనయందు నీశ్వరునందుఁ బ్రేమ
జీవునకుఁ గల్గు నంచును శివమతములు
చెప్పుచున్నవి యిందు విచిత్రగతుల
నద్వయము ప్రేమరీతి విస్పష్ట మగును. 92

అణుపాదమతము ;—

ఆత్మ కానిది యైన దేహాదికమున
నాత్మబుద్ధి మిథ్యాజ్ఞాన మగును, దానఁ
గామమోహాదిదోషముల్ గలుగు, వాని
హెచ్చుతగ్గులఁబట్టి దేహియును బాప
కార్యములఁ గాని పావనకార్యములను
గాని యొనరించు వాక్కాయమానసముల
నది ప్రవృత్తి యనంబడు, నదియె మరల
నధమగతిఁ గాని యుత్తమ మైనగతిని
గాని జన్మంబు నెత్తంగఁ గారణమగు.
దాని విడువక వచ్చుఁ బ్రాచీనకర్మ
వాసనాత్మకదుఃఖంబు వరుసతోడ,
నదియె సంసార మనఁబడు, నందు రోఁత

పొడమ జీవుండు గురుబోధఁ గాని పూర్వ
పుణ్యపరిపాకమునఁ గాని మూలమైన
మాయవిద్యను దలఁగు నుపాయమైన
తత్త్వవిజ్ఞాన మార్జించు, దాన వరుస 96

తొలఁగును మిథ్యాజ్ఞానము
తొలఁగును గామాదిచిత్తదోషము లంతట
తలఁగుఁ బ్రవృత్తియు దానన్
విలయించును భావిజన్మబీజము లంతట 97

ఈముక్తిఁ బ్రపంచ ముదయింపఁగఁ జేసినయామునీశ్వర
ధ్యేయుఁ డనాద్యనంతుఁ డగు నీశ్వరునకృప దుఃఖవాసనల్
పాయుటఁ జేసి జీవుఁ డనపాయము నిత్యము సత్యమైనని
శ్రేయస మొందు నంచు మునిశేఖరగౌతమవాణి తెల్పెడిన్

జైమిని మతము :—

శ్రుతివిహితప్రవర్తనుఁడు శుద్ధమనస్కుఁడు నయ్యు నీశ్వరా
ర్పితమతి ధర్మతత్త్వము నెఱింగిన జీవుఁడు నిష్ఠతోడ స
త్క్రతువు లొనర్చిపూర్వదురితంబులఁ బాసియపూర్వపుణ్యసం
గతిఁ గను నిష్టసిద్ధి నని గట్టిగ జైమినివాణి మ్రోఁగెడిన్

కర్మానుష్ఠానము భవ
కర్మహరం బనెడికోర్కె గని యీశ్వరుపై
నిర్మలభక్తిని వైదిక
కర్మము లొనరించి జీవి గను నభిమతమున్.

సేశ్వరసాంఖ్యము: —

* ఇరువదియాఱుతత్త్వముల నేర్పడె నీమత మిందుజీవుఁడ
న్పురుషుఁడు పూర్వకర్మఫలముం బడయంగ నిజానురూపసం
సరణముఁ జొచ్చి క్లేశపడఁ జాలక తత్త్వ మెఱుంగఁగోరి యీ
శ్వరు నెద నిల్పి యోగమునుసల్పి కనుంగొనుఁ గేవలత్వముల్
అని సేశ్వర సాంఖ్యం బనఁ
జనునుత్తమ మైనయోగశాస్త్రంబు రచిం
చిన పూజ్యుఁ డగు పతంజలి
ముని జీవేశ్వరుల తత్త్వమును బోధించెన్ 102
అపరిగ్రహము సత్య మస్తేయము నహింస
బ్రహ్మచర్యం బనఁ బరగుయమము
స్వాధ్యాయసంతోష శౌచతపోబ్రహ్మ
నిరతచిత్తత లన నియమ మగును
పద్మాదిదశవిధభవ్యాసనంబుల
నాచరించుట యగు నాసనంబు
వాయుపూరకము కుంభకము రేచక మనఁ
బరగుఁ బ్రాణాయామ మురుగుణంబు

---

*1 ప్రధానము, 7 మహదాదిప్రకృతివికృతులు, 11 ఇంద్రియములు, 5 భూతములు, 1 జీవుఁడు, 1 ఈశ్వరుఁడు, కలసి, ఈమతమున 26 తత్త్వములు. ఈశ్వరుఁడు లేఁడు గావునఁ దక్కిన యిరువదియైదు తత్త్వములే నిరీశ్వర సాంఖ్యమున నుండును.

చక్షురాదీంద్రియసన్నిరోధంబె ప్ర
త్యాహార మనెడి యుత్తమగుణంబు
బంధించి చిత్త మీశ్వరునిపైఁ దిరముగాఁ
గలుగఁజేయుట ధారణ యగు
నఖిలంబు మఱచి యేకాగ్రచిత్తత నీశు
ననయంబు దలఁచుట ధ్యాన మగును
ప్రత్యగాత్మకుఁ బరబ్రహ్మంబునందు నై
క్యము గల్గుట సమాధి యనఁగ జెల్లు

వీనియాచరణమునఁ బ్రధానమునకుఁ
దొలఁగి జీవుం డవిద్యచేఁ గలిగినట్టి
దుఃఖసంసారమునకును దొలఁగి యిష్ట
సిద్ధి గనఁజాలు నిదియె నిశ్రేయసంబు 104

పాణిమతము:—

శబ్దంబె పరబ్రహ్మము
శబ్దంబే యఖిలలోకసత్తయు నగుటన్
శబ్దాగమ పఠనోదిత
శబ్దజ్ఞానంబు మోక్షసాధన మరయన్. 105

జీవుఁడు శబ్దశాస్త్రము నశేషముఁ జక్కనెఱింగినన్ మహా
దేవుఁడు శబ్దరూపుఁడు నతీంద్రియుఁ డాపరమాత్మ యుండునా

నావిధమర్త్యరూపభువనంబున కెల్ల నిదాన మంచు స
ద్భావము పుట్టి శబ్దమయతత్త్వ మెఱుఁగుచుముక్తిగాంచెడిన్.

అని జీవేశ్వరభేదం
బును శబ్దబ్రహ్మతత్త్వబోధంబున ము
క్తిని బొందు జీవుఁ డని చూ
పెను వాణిని మోక్షరాజవీథిఁ గరుణన్. 107

అధునాతన బ్రహ్మమతము:—

పరమానందమయుండు శాశ్వతుఁడు సర్వవ్యాపకుండున్ జరా
చరసృష్టిస్థితిమూలకారణుఁడు విజ్ఞానాత్ముఁ డవ్యాజస
త్కరుణామూర్తి యనంతశక్తి యయి సత్యప్రేమ భాసిల్లునీ
శ్వరుఁ బ్రేమించి యుపాసనల్ సలిపి మోక్షంబొందు జీవా
త్ముఁడున్. 108

ఈశ్వరుఁడు తండ్రి యని యెంచి యెల్లజనులు
సోదరు లటంచుఁ బ్రేమతోఁ జూచి సర్వ
జంతువులయందు దయ గల్గి సాధుశీల
మమరియుండుట యిందు సారాంశ మరయ. 109

వర్ణమతభేద మనుమాట వలదు వలదు
పూర్వపరజన్మములమాట పొంతఁ బోకు
పుణ్యమున నీశ్వరప్రేమఁ బొందవచ్చుఁ
బాపమున కనుతాపంబు పడుట శిక్ష. 110

జ్ఞానసత్యదయాన్యాయ సాధుశీల
పావనత్వములందు నీశ్వరునితోడ
నైక్య మార్జించుటే మోక్ష మరయ నిందు
ధర్మమును బ్రేమ పరమసాధనము లగును. 111

పావనచిత్తంబున సం
భావించుచు భక్తియుక్తిఁ బరమప్రీతిన్
దేవు నుపాసనచేసిన
జీవుం డానంద మిష్టసిద్ధిని జెందున్. 112

అని జీవేశ్వరభేదం
బును దెల్పుచు బ్రాహ్మమతము పురుషుఁడు మోక్షం
బనుశాశ్వత మానందముఁ
గనఁ బ్రేమమె ముఖ్య మైనకారణ మనియెన్. 113

శంకరాచార్యమతము:—

అఖిలవేదాంతవాక్య సమన్వయంబు
సకల మతభేదవాదైక్యసాధనంబు
నైనయద్వైతమును దెల్పె నఖిలగురుఁడు
శంకరాచార్యునకు నమస్కారశతము. 114

ఆత్మతత్త్వంబు గాంచ మహానుభావు
లెంద ఱెన్నేని మార్గంబు లెఱుఁగఁజేసి

రైన నవి యెల్ల నెప్పటి కైనఁ దుదకు
ఘనతమాద్వైతమార్గంబుఁ గలసి తీరు. 115

నిత్యశుద్ధబుద్ధ సత్యరూపుఁడు నిరా
కారుఁ డఖిలలోకకారణుండు
సర్వమయుఁడు బ్రహ్మ సర్వజ్ఞుఁ డీశ్వరుఁ
డనఁగ నద్వితీయుఁ డాత్మ వెలుఁగు. 116

అట్టిపరమాత్మ నిచ్ఛమై నతనిమాయ
శక్తిఁ గల్పిత మీజగజ్జాల, మిందు
వెలయుజీవులు తత్ప్రతిబింబము లగుఁ
దరఁగలం దోఁచురవిబింబసరణియట్లు 117

ఘటములం దున్నయట్టియాకాశ మన్య
మగుఘటాకాశముగఁ దోఁచునట్లు తనువు
లందు చొచ్చినపరమాత్మ యన్యుఁ డైన
యట్టిజీవాత్మగాఁ దోఁచు నది యవిద్య. 118

అపరిణామియు సన్మయుఁ డవ్యయుండు
నైనపరమాత్మనివివర్త మగును గాని
కానఁబడు నట్టిజగము నిక్కంబు కాదు
తలఁప జీవేశ్వరులకు భేదంబు లేదు. 119

ఆ ప్రబోధనమున శుక్తియందు రజత
భావమును రజ్జువందు సర్పత్వబుద్ధి
యంతరించినయ ట్లాత్మయం దనాత్మ
బుద్ధియును నాత్మవిజ్ఞానమున నశించు. 120

దారసుతాదిబంధము యథార్థముగా మది నమ్మఁబోక సం
సారమునందు రోఁత శమసత్యదయాదులయందు బ్రీతియున్
గారణకారణుండగు జగన్మయుఁ డైనసదాత్మభావనన్
గూరిమి యూఁతగాఁ దనకుఁగనుంగొను జీవుఁడు పీతమాయుఁడై.

విద్య వినయంబు గల్గిన విప్రవరుని
గోల యగుదీను గోవును గుక్కరంబుఁ
గుక్కమాంసంబు తినునట్టి కూళఁగూడ
సమముగాఁ జూచువాఁడు విజ్ఞానఘనుఁడు. 122

అన్నిజంతువులం దున్నయాత్మ యొకటె
దేని కైనను హింస యించుకైనఁజేసి
తనకుఁ దాఁ జేసుకొనినట్లె తన్నుఁ బోలి
యన్నిటిని జూచునట్టివాఁ డాత్మవేత్త. 123

తెలియఁగఁ దామగానిదగు దేహము తామనియాయవిద్యలో
పలఁ బడి దేహదారసుతబంధము సత్యముగాఁగ నమ్మి జీ
వులు తమి నేను సాదనుచుఁ బుణ్యము పాప మొనర్చి పుట్టుచా
వులనదిఁ గూలి కొట్టుకొనిపోవు టనాదినిసర్గ మయ్యెడిన్.

పూర్వాపూర్వ జన్మపుణ్యపాపంబులె
యుత్తరోత్తరములవిత్తు లగును
చేసినట్టి మంచిచెడ్డల ఫల మింతె
యనుభవింపవలయు ననుట నిజము. 125

కావున ముందు వెన్కయును గానక జీవుఁడు మూర్ఖుఁడైయవి
ద్యావశుఁడై యనిత్యధనదారసుతాదులకల్మి సౌఖ్యముల్
లేవడి దుఃఖముం బడుచు లేనిది యున్నది యన్ననమ్మికం
బోవుచు నిందుచచ్చుచు బుట్టుచును గాసిలుచుండు, నీగతిన్. .

గాసిలి పిత్యగాత్మ నిజకర్మము రోసి యవిద్యఁ గల్గునీ
దోసము వాయ సాధనచతుష్టయసంపద గల్గి బ్రహ్మజి
జ్ఞాన రెయొనర్చి తెల్విమెయి సత్యము గన్గొని కర్మబంధనా
ధ్యాసవిముక్తిఁ గాంచి పరమాత్ముఁడెయమ్యెదుముక్తి పేరిటన్

అని వివరించునీమతము నందును దాను నిజస్వరూపమున్
గనుఁగొనుదాఁక జీవునిమనంబునఁ బ్రేమ ముముక్షురూపునం
గనఁబడి ముక్తివేళ నణఁగారును బ్రహ్మమున న్మనంబుతోఁ
గనుఁగొనఁ బ్రేమతత్త్వ మనఁగానిదెమానసతత్త్వమయ్యెడిన్.

కారుణికోత్తమున్ గురు జగన్మయు నీశ్వరు నాత్మనిల్పియీ
ధారణిలోనిప్రేముడి విధానములన్ సవిదర్శనంబుగాఁ
గూరిచి ప్రేమ తత్త్వమును గూర్చితి నీతివివేక పద్ధతిన్
సారవిచారులార! గుణసమ్మతి నీకృతిఁ జత్తగింపుఁడీ. 129

ఐహికాముష్మికముల నిర్వాహమునకుఁ
బుణ్యపాపంబులకుఁ బ్రేమ పుట్టినిల్లు
కాన దానిని మంచిమార్గమున నడపి
మనుజుఁ డిహపరసౌఖ్యంబు లెనయవలయు 130

## కృతిసమర్పణము

తెలిసినభక్తి గల్గిన పతివ్రత యోర్పును నేర్పువిద్యయుఁ
గలిగినయట్టి సచ్చరిత గాదిపుత్రులమాత నాతలం
పుల నివసించు ప్రేమమయమూర్తియుమత్సతి భావయమ్మయు
ర్మిలికిని ప్రేమతత్త్వ మొనరించి యొసంగితి నప్పు దీర్చితిన్.

ఇది

సంస్కృతకవిజీవితాంధ్రభాషానుశాసనాద్యనేక
కృతికర్తయగు మల్లాది సూర్యనారాయణ
శాస్త్రి రచించిన ప్రేమతత్త్వము
సర్వము.

